# ఉదాహరణ వాఙ్మయ చరిత్ర

రచయిత

విద్యారత్న నిడుదవోలు వేంకటరావు, M. A.

ప్రధానాంధ్రోపన్యాసకులు

ప్రాచ్యపరిశోధన సంస్థ

మదరాసు విశ్వవిద్యాలయము

మదరాసు — 1960

# PREFACE

Udaharana is a kind of "Desi" or indigenous poetical composition which is peculiar to the Telugu language. Like many other branches of Desi Literature, it is a much neglected one and very little is known about it, even to modern Scholars Its importance to the history of Telugu Literature lies in the fact that it represents a stage in the history of the development of literary types in Telugu—when compositions in Sanskrit metres, began to be mixed up with those of the Desi metres This reminds us of the "Chattana" and "Bendende" tyeps of old Kannada compositions referred to by Nripatunga in his *Kavirajamarga* Like the latter Bendende, which is said to have consisted of verses in Sanskrit (vritta) metres interspersed with compositions in Desya metres like akkara, gitike, tivadi, etc., Udaharana in Telugu also consists of verses written in Sanskrit metres, interspersed or regularly coming between Kalikas and Utkalikas which are only forms of Desi metre called Ragada One peculiarity to be noted here is that each verse ends in one of the seven case terminations, and for each of the seven or eight cases including sambodhana, a vritta followed by a Kalika and an Utkalika is composed, eulogising the greatness of a deity or the glory of a victorious king, the closing verse is again a vritta where all the eight cases are to be used—that is the composition must end with a Sarvavibhaktika verse. The Kalikas and Utkalikas, being forms of Ragada, bear 'adyanta prasa', *i.e.*, rhyme

at the beginning as well as at the end of each verse besides the 'Vadi' in the middle. These are made up of Matra ganas peculiar to Desi versification and are generally set to music. The 'Vadi' and 'Prasa' correspond to the Monai and Yedugai in Tamil prosody and their observance is almost a compulsory feature of the Telugu versification.

These are some of the peculiar features of 'Udaharana' compositions in Telugu and the earliest works that we have got are those written by Saiva poets—Palkuriki Somanatha of the 13th century A.D. and Tripurantaka of the 14th century A.D. Though we meet with some references to Kalikas or Utkalikas in some earlier works like Bharata's *Natyasastra*,[1] or even to a kind of Jayodaharana in Kalidasa's *Raghuvamsa*[2] where Raghu's glory was said to have been sung by the Kinnaras by means of a 'Jayodaharana' and also in *Vikramorvasiya*.[3] But we have no means of knowing definitely the nature of those compositions. When a Udaharana is said to be sung, it is the Saivite poet Palkuriki Somanatha himself that has given us the earliest available Udaharana written in Sanskrit as in Telugu.

It is nearly thirteen years ago, that I published the finest specimen of this literature, known as *Tripurantakodaharanamu* from a single manuscript copy obtained from the Tanjore Manuscripts Library, taking into consideration the printed edition of the same work

---

1. Bharata's *Natya Sastra* Chapter XV.
2. *Raghuvamsa*, 4th Canto 78th Sloka.
3. *Vikramorvasiyam*, 2nd act 15th Sloka.

published by the veteran Oriental Scholar, Sri M. Ramakrishna Kavi, M.A., in 1912. I have not only edited the text, but also appended, notes, and prefixed to it a long introduction in which I have shown, for the first time that this type of literature, is the basis for all subsequent types of literature in Telugu. I have also traced chronologically the origin and development of this important but forgotten branch of literature and brought to the notice of the Telugu scholarly world, that being an original contribution of Telugu to the South Indian vernaculars in general and Sanskrit in particular it demands a study and investigation both from literary and linguistic point of view.

The introduction and the publication was highly appreciated by all the Telugu scholars in general and particulary Sri C. R. Reddy, the then Vice-Chancellor of the Andhra University, who opined that the introduction is a "masterpiece of literary criticism and historical research and it is a grand performance".

The valuable opinion expressed by such an eminent scholar and educationalist in the field of Telugu Letters encouraged me to take up the investigation of this peculiar type of Telugu Literature. and completed it during my term as Junior Lecturer in the Madras University.

Last year I was awarded joint prize for *Tripurantakodaharanamu* by the Government of Madras for best books in Literary Criticism through the Telugu Bhasha Samiti, Madras.

The public recognition of my efforts in bringing out a complete history of Udaharana Literature necessitated

its printing, and I thank the Syndicate of the Madras University for having readily granted me permission to publish the work myself.

I owe a debt of gratitude to Sri B. Madhava Rau Garu, Proprietor of the Ananda Press for promptly undertaking the work for printing. He evinced a keen interest in the publication of the work and completed it in the specified time. I have to acknowledge specially the assistance rendered by (1) Sri Bulusu Venkata Ramanayya Garu the well-known Telugu Pandit of Madras in going through the Sanskrit Texts, by (2) K. Venkata Subba Sastry Garu, Ex-Pandit of the Government Oriental Manuscripts Library, now Pandit in the Ananda Press, for going through the proofs with great patience and scrutiny and (3) by Pandit N. S. Sundareswara Rao for examining the whole with originals in Palm leaf and paper manuscripts.

I cannot close the introduction without paying my respects to one of our greatest living Telugu Scholars Dr. G. V. Sitapati Pantulu Garu, the chief compiler of the *Telugu Encyclopaedia*, for the many valuable suggestions he has given, and for the paternal care he is taking in the advancement of my linguistic and literary studies.

---

# విషయసూచిక

పుట.

# విజ్ఞప్తి

ఇప్పటికి పదమూఁడేండ్లక్రిందట నీయుదాహరణ గ్రంథములలో కాలక్రమమునందు ద్వితీయమైన, కవితాప్రకర్షయందద్వితీయమగు రావిపాటి తిప్పన త్రిపురాంతకోదాహరణమును ప్రకటించితిని. దాని మాతృకను తంజాపూరినుండి తెప్పించి క్రీ. శ. 1912 లో విద్వాన్స్వ ర్యులు మా. రామకృష్ణకవిగారు ప్రకటించిన గ్రంథమును తోడుచేసి కొని, విపులపీఠికావివరణాదులతో వెలయించితిని. ఆపీఠికలో ఉదా హరణ శాఖయనునది వాఙ్మయమున నొక ప్రత్యేక విశిష్టతగల శాఖయని సోపపత్తికముగ నిరూపించితిని

ఈ గ్రంథప్రకటనమునకు కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారెంతయో నన్ను ప్రశంసించి, అచ్చుటచ్చుట సవరణలను సూచించిరి. పండితప్రభాకరులు ప్రభాకరశాస్త్రులవారీగ్రంథము నందుగల సహజాభిమానముచే, గ్రంథప్రకటనము గొనియాడుచు పాఠభేదములను దెల్పిరి. స్వామి శివశంకరులు 'ప్రతిభ'లో నీగ్రంథము సమీక్షించి గ్రంథవ్యాప్తికిఁ దోడ్పడిరి. పలువురు ప్రసిద్ధపండితులు పత్రికాధిపతులు గ్రంథప్రకటనమును సంభావించిరి. ప్రకటనమైన తోడనే, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు భాషాప్రవీణ ప్రిలిమినరీ పరీక్షకొకసారియు. మదరాసు విశ్వవిద్యాలయమువారు క్రీ. శ. 1944 నుండి 1950 వఱకు నాఱేండ్లును దీనిని విద్వాను పరీక్షకు పఠనీయ గ్రంథముగ జేసి నాకృతజ్ఞతకుఁ బాత్రులైరి. నేటికిని నీయుభయవిశ్వ విద్యాలయములయందు నిది భాషాప్రవీణ శాస్త్రోపాధ్యాయ పరీక్షలకుఁ బఠనీయ గ్రంథముగనున్నది.

క్రీ. శ. 1947 లో దీనిని పునర్ముద్రణము గావించితిని. విశ్వ ఖ్యాతవిమర్శకాగ్రేసరులు, విశ్వకళాపరిషదధ్యక్షులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారీద్వితీయముద్రణమును మిక్కిలిశ్లాఘించి, యిందలి పీఠిక అత్యుత్తమవిమర్శన శ్రేణికిఁజెందినదిగా తమయమూల్యాభిప్రా యము దెలిపిరి.

మదరాసు విశ్వ విద్యాలయమున తెనుఁగు భాషా శాఖలో నేను సహాయాంధ్రోపన్యాసకుఁడనుగా నియమితుఁడ నైననాటనుండి తగిన యవకాశములభించుటచే, నీవాఙ్మయ పరిశోధనకూడ నిర్ణీత కార్యక్రమమున చేర్చుకొని ఆమూలాగ్రముగ విషయములను సేకరించి దీనిని సంపూర్ణముగ రచియించి విశ్వవిద్యాలయము వారికి పంపుకొంటిని.

పైని వివరించినరీతిని పరీక్షలకు పఠనీయగ్రంథమగుటయేగాక భాషావాఙ్మయ పరిశోధకులు, పండితులు నీ గ్రంథమూలముననే నీయుదాహరణ శాఖావిశిష్టత నెఱుఁగఁగల్గిరి. మఱియు నీగ్రంథప్రకటనమువలననే, యధునాతన కవులలో నగ్రగణ్యులీగ్రంథప్రాశస్త్యము నెఱిఁగి యుదాహరణములను రచించిరి. కాబట్టి త్వరలో సమగ్రమగు నీశాఖావాఙ్మయమంతయు ముద్రింపవలసిన యవశ్యకత యేర్పడినది.

ఇంతలో క్రిందటి యేడు, మద్రాసు రాష్ట్రీయ ప్రభుత్వము వారు, తెనుఁగు భాషలోని యుత్తమ గ్రంథములకేర్పాటుచేసిన బహుమతులలో, విమర్శన గ్రంథశాఖలో నుత్తమ గ్రంథములుగా నెంచఁబడిన రెండింటిలో త్రిపురాంతకోదాహరణము నొకటి.. ఆ శాఖలో దీనికి తెనుఁగుభాషా సమితివారిద్వారమున బహుమతి లభించినది.

ఇంతచిన్న గ్రంథమునకిట్టి గొప్పవ్యాప్తి, విశిష్టత గలిగిన కారణముగా, దీనిని నేను ముద్రించుటకు మద్రాసు విశ్వ విద్యాలయము వారి ననుజ్ఞవేడితిని. అడిగినదే తడవుగా నాకనుజ్ఞయొసఁగిన మదరాసు విశ్వవిద్యాలయ కార్యనిర్వాహక వర్గము వారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈగ్రంథము నేను వ్రాసినదానికన్న, దీనిముద్రణ ప్రకటనలకు హేతుభూతులైన, ఆనందముద్రాక్షరశాలాధ్యక్షులు శ్రీ బి. మాధవ రావుగారి కీర్తియే చిరస్థాయియై యాంధ్రవిద్వల్లోకమున వెలయఁగలదు. ఈగ్రంథమునింత శీఘ్రకాలములో నింతచక్కఁగ ముద్రించి

యందించినందులకు ఆనందముద్రణాలయాధిపతులకు పదివందల వందనములు.

గ్రంథము ముద్రిత మగుచున్నప్పుడు సంస్కృతభాగము నంతను సరిచూచిన సుప్రసిద్ధాలంకారికులు, సంస్కృతాంధ్రపండితులు నగు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారికి నానమస్కారములు. ప్రూఫులను దిద్దుటయందు మిగుల శ్రద్ధవహించి, మిక్కిలియోపికతో నింత శుద్ధముగా నీగ్రంథము వెలువడుటకు కారణభూతులైన ఆనంద ముద్రాక్షరశాలాపండితులు శ్రీ కే. వెంకటసుబ్బాశాస్త్రిగారికి నాధన్యవాదములు.

మూలతాళపత్రమాతృకలతోడను, వ్రాతప్రతుల తోడను నీగ్రంథమునామూలాగ్రముగ సరిచూచి పరిశీలించిన చిరంజీవి శివసుందరేశ్వరరావునకు నాయాశీస్సులు.

గ్రంథరచనారంభమునుండియు నమూల్యమైన సలహాల నొసగుచు, నిరంతరము నాశ్రేయస్సునాకాంక్షించు నాంధ్రవిద్వదగ్రేసరులు నాంధ్రవిజ్ఞానసర్వస్వ ప్రధానగ్రాహకులునగు డాక్టరు శ్రీ గిడుగు సీతాపతి పంతులుగారికి నాహృదయపూర్వక నమస్సులు.

ఎంత జాగ్రతగఁ జూచినను అనివార్యముగనచ్చు తప్పులచ్చటచ్చటఁ బడినవానిని క్షమించి దిద్దుకొన పాఠక మహాశయులు ప్రార్థితులు.

ఇతి శివమ్.

ఇట్లు విధేయుఁడు :

స్వాతంత్ర్య దినము
15—8—50
చెన్నపురి.

నిడుదవోలు - వేంకటరావు, ఎమ్. ఏ.,
మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర భాషాశాఖాధ్యక్షుఁడు.

# అవతారిక

ఉదాహరణ గ్రంథములు తెలుఁగుసాహిత్యమున నొక ప్రత్యేక శాఖగా పరిగణింపఁదగినవి - తెలుఁగుసాహితీరీతులును కవితారచనలును పుట్టుకచేత, తెలుఁగుభాషవలె దాక్షిణాత్య సంప్రదాయమునకు సంబంధించినవి. సాంస్కృతికమగు నార్యభాషాసన్నిహిత సంబంధము వలన, నా సంప్రదాయములను మేళవించుకొని పెంపుఁ జెందినవి. తెలుఁగున పదపద్యకవితలలో, పదకవిత దాక్షిణాత్య సంప్రదాయమునకు, పద్యకవిత యార్య సంప్రదాయమునకుఁ జెందినవి. వీనినే దేశియనియు, మార్గమనియు ప్రాచీనులు వ్యవహరించిరి. కావున నైసర్గికముగ నాయాదేశముల నుత్పన్నమైన కవిత దేశియనియు, నట్టి దేశి కవిత యార్య సంస్కారమును పొందినది మార్గమనియుఁ జెప్పవచ్చును.

తెలుఁగుసాహిత్యములో, మహాకావ్యములు, పురాణములు, చంపువులు, ప్రబంధములు, మార్గకవితలనియు, ద్విపదలు, యక్షగానములు, శతకములు, ఉదాహరణములు, దండకములు దేశికవితలనియు చెప్పనొప్పును. ఈ రెండు పథకములయందు రచనలు వేయేండ్ల నుండి యవిచ్ఛిన్నముగ సాగుచున్నవి. తెలుఁగున నొక కాలమున నుత్తమ సాహితీశ్రేణికి పద్యరచనయొక్కటియే చెందినది యను అభిప్రాయము ప్రబలమగుటచేత పదకవితలయం దాదరణ సన్నగిల్లినది. అయిన నది దేశీయ మగుట చేతను, ప్రజాసామాన్య మంతయు దానినే యాదరించువారగుటచేతను, చరిత్రకెక్కకపోయినను నెంతయో యభివృద్ధి గాంచినది. దీనికి మతసంప్రదాయములు తోడుపడినవి. ఆర్షేయమగు వైదికమతసంప్రదాయకమగు మార్గకవితయే రాజాదరణముగాంచినది. అవైదికమగు శైవమతసంప్రదాయములు ప్రజాదరణము గాంచినవి - ప్రాచీన కాలమున నా సంప్రదాయములకు మతదృష్టి సాహిత్యదృష్టి ప్రధానమైనది. మఱియు నేటి చారిత్రకదృష్టి

మృగ్యమనియే చెప్పవగును. కాలక్రమమున నాయాదృష్టి పథకములు వేరైనవి.

నవీనకాలమున, చారిత్రకదృష్టియు సాహిత్య సామరస్య దృష్టియు ప్రధానములైనవి. కాబట్టి తెలుఁగున విలసిల్లిన నానాశాఖల చరిత్రమును సమగ్రముగను, సప్రమాణముగను శాస్త్రీయముగను తెలిసికొనవలసినయవశ్యకత యేర్పడినది. కాని యట్టిప్రయత్నములు సక్రమముగా నీవఱకు జరిగినట్లు కానరాదు. ఒక్క శతక వాఙ్మయ శాఖకుమాత్రమట్టి చరిత్రకలదు. నేఁడుదాహరణశాఖకు నట్టి క్రమ చరిత్రమును సమకూర్చితిని. ఇంకను తక్కిన శాఖలను గూర్చి నెంతయేని పరిశ్రమజరుగవలసియున్నది. ఇంకనిట్టి శాఖలలోఁ జేయఁదగినపరి శ్రమను దెలుపుచున్నాఁడను.

తెలుఁగున ప్రధానమైనది కావ్యప్రబంధశాఖ. ఏశాఖయందును నీశాఖయందుఁబుట్టినన్నియుత్తమగ్రంథములు పుట్టియుండలేదు. వీనిలో నెన్నింటినిగూర్చియో విశేషము తెలుఁగఁదగియున్నవి.

## పద్యకవితలు

కావ్యప్రబంధశాఖ :— సాహిత్యము - చరిత్ర

పురాణ మహాకావ్యములు - కేవల కావ్యములు - ప్రబంధములు - ఇతిహాసములు - పురాణములు - మహాత్మ్యములు - వీని చరిత్ర - చంపూపథకము - సాహిత్యరీతులు. ప్రబంధవాఙ్మయము శృంగారప్రబంధములు - చారిత్రకప్రబంధములు - ప్రబంధ పరిమాణము - తెలుఁగుభాషలోఁగల ప్రత్యేకత.

శతకశాఖ :— ఈశాఖయందు పరిశీలన జరిగినది - శతకకవులచరిత్ర దీని ఫలితము.

ద్విపదశాఖ :— తెలుఁగున ప్రత్యేక విశిష్టత గల యీశాఖాచరిత్ర మును నేను చేయుచున్నాఁడను. ఇది ప్రబంధశాఖవలె, మిక్కిలి విలువగలది.

**యక్షగానములు** :- - మధుర విజయములో ప్రగ్రస్థానమునువహించి నాటకములకు మూలములగు నీయక్షగానములఁ గూర్చిన పర్యాప్తమైన పరిశీలన లేదు - ఇది ముఖ్యముగ జరుగఁదగినది.

**ఉదాహరణములు** :—ఈచరిత్రము నిపుడు పూర్తియైనది.

**దండకములు** :—ఇదియును నపరిశీలితము - ఇందు భక్తి, శృంగార, చారిత్రకవిభాగములు గలవు.

## పదకవితలు

**గేయకృతులు** :—ఇవి సంగీతశాస్త్రమునకేగాక సాహిత్యశాస్త్రమునకు సంబంధించినవి. స్వరప్రధానమగు సంగీతమునకును వర్ణప్రధానమగు సాహిత్యమునకు నైక్యతఁగూర్చిన తెలుఁగు భాషలో నా రెండింటి పరస్పర సంబధము విడదీయుట కంటె యజ్ఞత వేఱొకటిలేదు - ఇవియును సారస్వతమున నుత్తమ శ్రేణిలోఁ జేరఁదగినవి యే - ఇది యతి విస్తృతమైనశాఖ - 1. వచనములు - 2. పదములు - 3. సంకీర్తనలు -

**సుసంస్కృతములు**—వీనిలో పదములు తాళ్లపాక, క్షేత్రయ, యోగంటి సారంగపాణి పదములు -

**అసంస్కృతములు**—స్త్రీల పాటలు - తందానతాన పదములు, పురాణ కథారూపమున పదములు, ఏల, జోల, సువ్వాలపాటలు.

**వచనకావ్యశాఖ** :—ఆంధ్రగద్య వాఙ్మయ చరిత్రయను పేర నీ విషయమై కొంత పరిశోధన ప్రారంభమై యొక సంపుటము వెలువడినది.

**శాస్త్రీయగ్రంథములు** :—గణిత, వైద్య, వేదాంత, జ్యోతిషములు - వ్యాకరణచ్ఛందోఽలంకారగ్రంథములు - నిఘంటువులు.

పై శాఖలన్నియు ప్రాచీనకాలమునుండి నేటివఱకు నవఁగా నవీన వాఙ్మయము ప్రవర్ధిల్లినదాక వర్తిల్లుచున్నవి. కాబట్టి నవీన వాఙ్మయశాఖ లిందు చేర్పఁబడలేదు.

పై శాఖలలోని గ్రంథసముదాయము చాలవఱకు ముద్రితము కాలేదు. ముద్రితమైన గ్రంథములలో, శాస్త్రీయ పద్ధతిని సమ్యక్పరిష్కృతములైన గ్రంథములు చాలతక్కువగనున్నది. వానిలోనైన చారిత్రక పరిణామము, సాహితీపరిణామము నెఱుంగుటకు వీలైనరచనలు విశేషముగ లేవు. ఈకారణముచేత మనకు సర్వాంగ సంపన్నమైన యాంధ్రవాఙ్మయ స్వరూపమును సంపూర్ణముగ గోచరింపఁజేయు సాధనసంపత్తి సమకూడకున్నది. ఆంధ్రవాఙ్మయస్వరూపము నామూలాగ్రముగ నెఱుంగుటకు 'ఆంధ్ర గ్రంథసూచికాసర్వస్వము' అనుగ్రంథ మత్యావశ్యకము. దీనినే యాంగ్లేయభాషలో Bibliography లేక Catalogus Catalogorum అని యందురు. సంస్కృత భాషకిట్టియుద్గ్రంథము నాఫ్రేటు (Aufret) అను శార్మణ్య (జర్మను) విద్వాంసుఁడరువదియేండ్ల క్రిందట ప్రకటించినాఁడు. దానినే తిరిగి సంస్కరించి మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రకటించుచున్నారు.

అన్ని దేశభాషలన్నింటికి నందుముఖ్యముగ తెనుఁగునకు నిట్టి సూచికాగ్రంథములుండుట[1] యత్యవసరము. ఇట్టి గ్రంథము లేని కారణముననే 'ఉదాహరణము' అను ప్రత్యేక వాఙ్మయశాఖయొకటి యున్నట్లుగా పండితులకేని తెలియరాలేదు. ఏవాఙ్మయ చరిత్రమునందును నుదాహరింపఁబడియుండ లేదు. కావున నీవాఙ్మయ చరిత్రమును నొక్కచోట కూర్చిన. సాహితీ వేత్తలకు, చరిత్రకారులకు నుపాదేయముగ నుండునని యీగ్రంథమును రచియించి ప్రకటింప సాహసించితిని.

---

1. తెనుఁగుభాషలో నిట్టి గ్రంథమును క్రీ. శ. 1926 లో, ఆంధ్రవాఙ్మయ సూచిక అనుపేర కీర్తిశేషులు కళాప్రపూర్ణులు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు ప్రకటించియున్నారు. అదియుపయోగకరమైనదేకాని యీనాఁడు, మనకసంఖ్యాకముగా లభించిన నూతన గ్రంథసామగ్రితో గూడ, నాగ్రంథము పూర్తిగ సంస్కరించి పునర్ముద్రణము చేయఁదగినది. అందులకు ఆంధ్రపత్రికాధ్యక్షులే త్వరలో పూనుకొందురుగాక !

# ఉదాహరణములు - వానిలక్షణము

ఉదాహరణమనఁగా భాషయందుగల సప్తవిధ విభక్తులు సంబోధన విభక్తిని నుదాహరించు లఘుకృతి.

ఇందులో వృత్తములు, కళికలు - ఉత్కళికలు - సార్వవిభక్తిక పద్యము కవికృతి నామాంకిత పద్యములు నుండును.

వృత్తములలో చంపకోత్పల మాలికలును, శార్దూల మత్తేభములును నుపయుక్తము లగును.

కళిక యనఁగా-మాత్రాచ్ఛందస్సునకు సంబంధించిన రఘటా లేక రగడ భేదము - 8 పాదములు.

ఉత్కళిక యనఁగా కళికలో సగము భాగము - అర్ధకళిక.

ఇదియంతయు సంబోధనయందు దప్ప తక్కిన వానియందు ననఁగా 8 పాదములయందును నొకే సమాసముగా నుండవలెను.

సార్వవిభక్తికము - ఒక్క పద్యమున నే నన్ని విభక్తులునుండుట. ఇది సాధారణముగ శార్దూల వృత్తముతో నుండును.

కవికృతి నామాంకిత పద్యము - దీనియందుదాహరణము రచించిన కవిపేరు. కృతిపేరు నుండును.

ఉదాహరణములయందు విభక్తి ప్రత్యయము లన్నియు నుదాహృతములు కానక్కఱలేదు. ఆ ప్రత్యయము వృత్తములయందు నొక్కచోటను సాధారణముగ నాలవ పాదమునందు భాసింపవలెను. కళికయందు ప్రతి పాదాంతమునను భాసింపవలెను. ఉత్కళిక యందు నాలు పాదములయందు భాసింపనక్కఱలేదు. చివఱి రెండింటియందు కన్పట్టవలెను. ఒక్క చతుర్థియందు మాత్రము ప్రతి పాదాంతమునను 'కై' అను ప్రత్యయము, విభక్తి కాకపోయి

నను భాసింపవలెను. ఇది విభక్తివలె తోపింపఁజేయును గాని, కేవల విభక్తి కాకపోవుటచే విభక్త్యాభాసమైనది.

ఉదాహరణములలో నియతముగా పై వృత్తములు తక్కిన పద్యజాతు లేవియు నుపయుక్తములు కావు.

రగడలలో త్ర్యశ్ర, చతురశ్ర, మిశ్ర జాతులు ప్రకటితములగును త్ర్యశ్ర (త్రిస) సరియగు రూపము - కాని సంగీతశాస్త్రము నిట్లే వాడుక,

త్ర్యశ్రము - మూఁడక్షరముల లఘుకాలము. చతురశ్రము - నాలుగక్షరముల లఘుకాలము. మిశ్రము - ఏడక్షరముల లఘుకాలము. ఇవి, త్రిపుట, జంపె, రూపక తాళములతో పాడవలెను.

ఉదాహరణములు, సంస్కృత భాషలో నతిప్రాచీనకాలము నుండి యున్నట్లు మనకుఁ దెలియుచున్నది. ఋగ్వేదమున కుంతాప సూక్తమున నిట్టివిగలవు. లౌకిక సంస్కృతమున కవికుల గురుఁడు కాళిదాసు కాలమున నున్నట్లు, రఘువంశమునుండి[౧], విక్రమోర్వశీయమునుండి[౨] తెలియుచున్నది. కాని యాకాలమునివి యేరూపమున నున్నవో తెలిసికొనుటకు మన కేయాధారము లేదు. భరతుని నాట్యశాస్త్రమున కళికోత్కళికలు ప్రపంచింపఁ బడియుండుటచేత నట్టి కేవల మాత్రాచ్ఛందస్సులుగల రచనలే యందుండి యుండునని

---

౧. రఘువంశము—"జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్"
—4 సర్గ. 78 శ్లోకము.

౨. విక్రమోర్వశీయము - ద్వితీయాంకము ౧౫ శ్లో.
'పత్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః'

3. 1. పాల్కురికి సోమనాథకృత సంస్కృత బసవోదాహరణము— ముద్రితము.

2. చిక్కదేవరా యోదాహరణము - అముద్రితము.

3. శివోదాహరణము. 4. సిద్ధరాముని యుదాహరణము అముద్రితము.

యూహింపనగును. నేఁడు మనకు లభించిన మూఁడు సంస్కృతో దాహరణములును నాంధ్రోదాహరణ లక్షణ లక్షితములై యున్నవి. కావున నుదాహరణములు, మార్గ దేశికవితా భేదముచే రెండు తెఱఁగులుగా నేర్పడిన పథకములలో, తెలుఁగున దేశికవితా శాఖలో ప్రత్యేక విశిష్టతగలవిగా నెన్నఁనగును.

సంస్కృత భాషలోనే లేనప్పుడు, తక్కిన దేశభాషలయందివి లేకుండుట యాశ్చర్యము కాదు. తెలుఁగునకన్న ముందుగా పెక్కు సాహితీరీతుల వెలయించిన కన్నడ వాఙ్మయమున నిట్టి యుదాహరణములు లేవు. అఱవమునం దంతకంటె లేవు. ఇది యొక్కటియే, దక్షిణహిందూదేశమున నాంధ్ర సారస్వత విశిష్టత తెలుపఁగలదు.

ఈయుదాహరణములు భాషావాఙ్మయ చరిత్రల కెట్లు తోడ్పడునో వివరించెదను.

## ఆంధ్రకవితా పరిణామము
## (Evolution of Telugu Poetry)

ఆంధ్రకవితా పరిణామమును దెలిసికొనుట కుదాహరణములు సాధనములు. తెలుఁగు కవిత యేకపదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పదమై పరిణతిఁ జెందినట్లు కానవచ్చుచున్నది. ఏకపదములగు పాటలును, ద్విపదములగు ప్రబంధములును, త్రిపదాది సంయుక్తములై సంపూర్ణగాన యోగ్యములగు యక్షగానములును, సలక్షణ చతుష్పాద వృత్తకవితా సమన్వితములగు భారతాది గ్రంథములును వాఙ్మయ వీథిని ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థఘట్టములు. ఉదాహరణము లీతృతీయ ఘట్టమునఁ జేరినవి. ఇవి కేవలము ఏకపదములుగాక, ద్విపదాదులవలె నొకే ఛందస్సు ననుసరింపక, పదకవితయందలి యేదేనొక ఛందోవిశేషము ననుసరించును. యక్షగానములవలె గాన యోగ్యములైన పదములను హెచ్చుగాఁ గలిగి యుండకపోయినను లయ, తాళసమన్వితములగు పదములతోఁగూడి వృత్తములు గలిగియుండును. కావున నివి ద్విపదకవితకును, యక్షగాన కవితకును మాధ్యమికములని నిశ్చయింపవచ్చును.

## సంగీత సాహిత్యముల సంబంధము

## (Relation between Music & Poetry)

సహజమాధుర్యప్రధానమగు నాంధ్రభాష సంగీతమునకను వగునట్లితర భాషలు కాఁజాలవు. ఆంధ్రభాష యందుఁ బద, పద్య కవితలలో పదము సంగీతమును, పద్యము సాహిత్యమును దెలుపును. ఆంధ్రకవితావిషయమునఁ బ్రయుక్తములగు మార్గదేశి పదములు సంగీతశాస్త్రమునుండి సాహిత్యమునఁ బ్రసక్తములైనవి. భరతాచార్యుని నాట్యశాస్త్రముననే మార్గదేశిభేదములు ప్రపంచితములైనవి. ఉదాహరణములలో నియతములగు రగడలు తాళాంగ ప్రధానములు.

తాళాంగమున త్ర్యశ్ర, చతురశ్ర మిశ్రజాతులు ప్రకటితములగుచుండును. ఉదాహరణములోని రగడల నాయా తాళములతోడ గానము చేయవలెనని మనయాంధ్రలాక్షణికులు నిర్దేశించియున్నారు. హరగతియను రగడకు నాటతాళమును, హయప్రచారము, తురగవల్గనము, విజయమంగళము నను వీనికి రూపకతాళమును, మధురగతి కేకతాళమును, ద్విరదగతి, విజయభద్రలనువానిక జంపెతాళమును, హరిణగతి, వృషభగతులకు త్రిపుటతాళమును ఛందోగ్రంథములందు నియతములైయున్నవి. అనఁగా నీ రగడ లాయా తాళముల ననుసంధింపఁబడవలెనని లాక్షణికులమతమని తెలియుచున్నది. మఱియు నవ్యక్తమధురమగు గానమునకు సువ్యక్తమధురమగు తెలుఁగుకవితకు నుదాహరణములే కుదిరికఁ గూర్చినవి.

## ఛందస్సు

## (Prosody)

ఉదాహరణములలో వృత్తములు మార్గకవితానుసరణములు. రగడలు దేశికవితానుసరణములు. ఉదాహరణములలో నుపయుక్తములగు చంపకోత్పలములు, మత్తేభ శార్దూలములు నక్షర గణప్రధానమగు సంస్కృతచ్ఛందస్సునుండి జనించినవి. రగడలు

మాత్రాగణనిబద్ధములై దేశికవితకు నాధారమగు నాంధ్రఛ్ఛందస్సు నుండి పుట్టినవి. ఈ ఛందస్సమ్మేళనము తొలుత గ్రంథరూపమున నాంధ్రవాఙ్మయమునం దుదాహరణములయందే కానవచ్చుచున్నది. మఱియు నీవిషయము సంస్కృతాంధ్రఛ్ఛందస్సుల పౌర్వాపర్యనిర్ణయమునకుఁ గూడఁ దోడ్పడఁగలదు. చంపకోత్పలములు సంస్కృతమున నున్నను వానికి సంస్కృతమునఁ బ్రచారము లేదు. రగడకు 'రఘట' మనియు, సీసమునకు 'శీర్షక' మనియు సంస్కృత నామములు కలవు. కాని సంస్కృతమున రఘటకును, శీర్షకమునకును ప్రచారమే లేదు. ఇట్లే ద్విపదలక్షణము సంస్కృతమున నున్నను తెలుఁగుననే ద్విపదకుఁ బ్రచారము మెండు. సంస్కృతమున లేదు. రగడ, సీసము, ద్విపద మున్నగు ఛందస్సులు దేశికవితకు సంబంధించినవి. ఏజాతివారికైన జాతీయ వాఙ్మయముతొలుత పదరూపముగనుండఁగ, దానినుండియే ఛందస్సు లావిర్భవించుచుండును. ద్రావిడభాషలలో, నందు ముఖ్యముగఁ గర్ణాటాంధ్రభాషలలో సంస్కృత భాషాసంస్కారమును, సంసర్గమును హెచ్చుగానుండుటచే ద్రావిడభాషాసహజములగు ఛందస్సులే సంస్కృతములై భారతీయ వాఙ్మయమునఁ బ్రపంచింపఁ బడెనని ఛందశ్శాస్త్రవిమర్శకులు కొందఱు తలంచుచున్నారు. వారి తలఁపులకు నేఁడు తావులేకపోలేదు. నేఁడు సంస్కృతభాషయందు ద్రావిడ భాషలనుండి తీసికొనిన పదములు పెక్కువ్యవహారమునుండి సంస్కృతముగాఁ బరిగణింపఁబడుచున్నవి[1]. ఆ విధముగానే ద్రావిడ భాషలలోని ఛందస్సులుకొన్ని సంస్కృతమునఁజేరి సంస్కృతములయ్యెననుటయు సమంజసముగఁ గన్పట్టుచున్నది. దక్షిణాపథమున నార్యనాగరకతావిజ్ఞానములు వ్యాపింపకపూర్వము తద్విలక్షణమగు ప్రత్యేకదాక్షిణాత్య విజ్ఞానమును, నాగరకతయును బెంపొందినట్లు చరిత్రవలన మనకుఁ దెలియుచున్నది. పై విషయములఁ బట్టి దేశభాషాసహజములగు ఛందస్సులంగూర్చి మన మెంతయేని పరిశ్రమ

---

1. ఇట్టి పదముల పట్టికకు కిట్టెలు దొరగారి 'కర్ణాటాంగ్లభాషానిఘంటువు' భూమికఁజూడఁదగు.

కావించి వానిప్రత్యేకత నెఱుంగవలయును. నన్నయాది మహాకవు లీదేశికవితాప్రాధాన్యమును, దేశభాషా ఛందస్సులను గమనించియే తమ గ్రంథములందు జాత్యుపజాతులను వృత్తములకంటె విపులముగా వాడియున్నారు. ఆంధ్ర కవితాసౌధనిర్మాణమునకు ఛందస్సు పునాది వంటిదిగదా !

## వ్యాకరణము

## (Grammar)

విభక్తిప్రత్యయములను నియతముగాఁ గూర్చుటచే నుదాహరణములు వ్యాకరణశాస్త్రమును, భాషాతత్త్వశాస్త్రమును దెలిసికొనుట కుపయుక్తములగుచున్నవి. ఆంధ్రవ్యాకరణములలోఁ జెప్పఁబడు విభక్తిప్రత్యయముల పరిణామమును, వానివ్యుత్పత్తులను నెఱుఁగుట భాషాచరిత్రకారుల కత్యంతావశ్యకము. ఆయాకాలములం బుట్టిన యుదాహరణముల నాయాకాలములఁబుట్టిన వ్యాకరణముల ననుసరించి పరిశీలించినచోఁ గొన్ని విభక్తులకు వ్యాకరణములలోఁ బ్రత్యయములుగాఁ జెప్పఁబడినవి యుదాహరణములలోఁ గానరావు. ఒక్క యుదాహరణములయందేగాక ఆయా కాలములఁ బుట్టిన కావ్యాదులందును నాయాప్రత్యయము లుపయుక్తములు కాకుండుటచే నాంధ్రవైయాకరణులు విభక్తులఁ గూర్చియొనర్చిన సిద్ధాంతము లెంతవఱకుఁ బ్రమాణములుగాఁ గొనఁదగునో యూహింపవలసియున్నది. 'కై, కొఱకు' అనుచతుర్థీవిభక్తి ప్రత్యయముల నిందులకుదాహరణముగాఁ జూపుచున్నాను. క్రీ. శ. ౧౨౨౦ సం. ప్రాంతమునరచితమైన బసవోదాహరణమునఁగాని, క్రీ. శ. ౧౩౮౦ సం. ప్రాంతమున రచితమైన త్రిపురాంతకోదాహరణమునఁగాని యీప్రత్యయములు కానరావు. ఒకవేళ యుదాహరణకర్తలు వీనిని మానిరన్నను, నంతకుముందు క్రీ. శ. ౧౦౫౦ సం. ప్రాంతమున రచియింపఁబడి మనకు లభ్యములైన గ్రంథములలోఁ బ్రథమముగాఁ బరిగణింపఁ బడుచున్న నన్నయభట్టరచిత భారత

భాగమునఁ గాని, యీకాలమున మనకు లభ్యములైన శాసనములలోఁగాని యీ ప్రత్యయములు కన్పట్టవు. ప్రాచీన వ్యాకరణములలో నాంధ్రభాషలోఁ బద్యరూపమున వెలసిన తొలివ్యాకరణమగు నాంధ్రభాషా భూషణమున 'కొఱకు' ప్రత్యయము లేదు. నన్నయభారతమున 'కై' ఉపయోగింపఁబడినను నది 'కు+అయి' అని విభజింపఁబడినది. ఆ ప్రత్యయము ప్రయుక్తమైనపుడెల్ల స్వరయతియేగాని, వ్యంజనయతి లేకుండుటచే నన్నయకాలమున నీ ప్రత్యయము వాడుకలో లేదని చెప్పనొప్పును. కేవలము 'అయి' అను ప్రత్యయమే 'కొఱకు' అనునర్థమునఁ బ్రాచీనకాలమున వాడుకలో నుండెను. ముందు పేర్కొనిన బసవపూదాహరణముననను, త్రిపురాంతకోదాహరణముననను చతుర్థీవిభక్తి రూపము 'కునై' అనికలదు. ఇది షష్ఠీవిభక్తి ప్రత్యయమగు 'కున్' అనుదానికి చతుర్థీవిభక్తి ప్రత్యయము 'అయి' చేర్చుటవలన నేర్పడినది. ఇట్టి ప్రత్యయరూపనిష్పత్తి క్రమము మనమెఱింగినచో వ్యాకరణములోఁ జెప్పఁబడిన చతుర్థికి షష్ఠియే నిలుచునను సూత్రార్థమును సులభముగ గ్రహింపఁగలము. ఆంధ్రవిభక్తి ప్రత్యయముల చరిత్రము మన మీవిధముగఁ బరిశీలించిన భాషాతత్త్వశాస్త్ర మెంతయేని యభివృద్ధినందఁగలదు.

విభక్తి ప్రత్యయముల వాడుక నియతముగా నుదాహరణముల నున్నను, నాంధ్రప్రబంధములయందును, యక్షగాన, శతకాదులందును విభక్తి నియమము కానవచ్చుచున్నది. ఇది యావాఙ్మయములపైని ఉదాహరణ వాఙ్మయ ప్రభావలక్షణమేయని నిరూపింప

---

౮. ఆచార్య చిలుకూరి నారాయణరాయ విరచితము 'ఆంధ్రభాషా చరిత్రము' ద్వితీయభాగము.

1. విభక్తి ప్రకరణము. పుట. 1060.

2. పదునొకండవ శతాబ్దమునాఁటి తెనుఁగుభాష. పుట. 1388.

3. ఆంధ్రశబ్ద చింతామణి - అజన్త పరిచ్ఛేదము. పుట. 1622.

**పై యాకరములవలన 'కై, కొఱకు' 'చతుర్థ్యాః స్తః' అని సూత్రింపఁబడిన ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమనుట చెల్లదుకదా!**

వచ్చును. కొన్ని ప్రాచీనాంధ్ర ప్రబంధములయం దాశ్వాసాంతములు సంబోధనాంతములుగానుండక, యొక యాశ్వాసమే విభక్తితోనంత మొందినఁ దరువాతి యాశ్వాస మావిభక్తితోడనే మొదలిడుట కానవచ్చుచున్నది.

ఇఁక సర్వాంధ్ర ప్రబంధసాధారణములగు షష్ఠ్యంతములు కూడ నీయుదాహరణ లక్షణమేయని చెప్పనొప్పును. ఆంధ్రప్రబంధములలోఁ గృత్యవతరణికతొల్లి సార్వవిభక్తికముగా నుండెడిదనియుఁ, గాలక్రమమున నాపద్ధతిమాఱి, శేషషష్ఠియు, సంబోధనయు నుపయుక్తమై షష్ఠ్యంత సంబోధన విభక్తి రచనము నియతమయ్యెననియు, నూహింపఁదగియున్నది. యక్షగానములయం దంతములు ద్వితీయా విభక్తితోనుండును. శతకములన్నియు సంబోధనతో నుండుట యందఱెఱింగినదే! పద్యమయములగు ప్రాచీనాంధ్రభాషా శాసనములయందు సంస్తుతులయందు విభక్తులు వెలయుచుండుటచే, స్తుతిపరమగు నుదాహరణముల ప్రాచీనతకు నీవిషయము తోడ్పడుచున్నది.

## ఉదాహరణముల ప్రాముఖ్యము

## (General Impoitance in Literature)

ఆంధ్రవాఙ్మయమునఁ బురాణేతిహాసకావ్యనాటకాదులయందలి లక్షణములన్నియు నంతర్భూతములై యుండుటచే నుదాహరణములా యాగ్రంథములవలనఁ గల్గుప్రయోజనములన్నిటి నొసంగి యానందముఁ జేకూర్చుచున్నవి. భక్తిరస ప్రధానములగు మతములకు, ముఖ్యాంగమగు గానకళకు సంబంధించిన యుదాహరణములు పండ్రెండవ శతాబ్దికిముందే వెలయుచున్నట్లు శైవవాఙ్మయమువలనఁ దెలియుచున్నది.

---

# ఉదాహరణములు సాహిత్యసమీక్ష

తెలుఁగుకవిత, ఆశు, మధుర చిత్రవిస్తర కవిత్వములని నాలుగు విధములు. వీనికే 'చతుర్విధ కవిత'లనిపేరు. ఈ కవితా విభాగములు క్రీ శ. 1050. నన్నయకాలమునుండి తెలుఁగున వెలయుచున్నవి. నన్నయ భారతావతారికలో, "మృదుమధుర చిత్రవిస్తర నవరస భావభాసుర కవితారచనా విశారదులైన మహాకవులు" న్నట్లు ఆదిపర్వము (1-8) లో చెప్పియున్నాఁడు. దీనినే శ్రీనాథమహాకవి నైషధములో[1] (1-11) "మృదు మధురచిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులును," అని యనువదించినాడు. నన్నయ శ్రీనాథు లిరువురును నాశువునకు 'మృదువు' అనుపేరును వాడియున్నారు. తక్కినవారు పైరీతినే ఆశు మధుర చిత్రవిస్తరము లని పేర్కొనిరి. అప్పకవి (క్రీ. శ. 1656) నాఁటినుండి యీ సంప్రదాయము మఱుఁగుపడి ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వమను మతభేద మేర్పడినది. అయినను చాలమంది కవులును లాక్షణికులును ప్రాచీన సంప్రదాయమునే పాటించిరి.

అష్టభాషల మధురాశు విస్తర చిత్ర
కవితలు చెప్ప సత్కవులు మెచ్చ (6-13)

—వెన్నెలకంటి అన్నయ్య - షోడశకుమార చరిత్ర. 14 వ శతాబ్ది.

ఆశు మధుర చిత్రవిస్తార కవిత్వతత్త్వ కోవిదత్వప్రసక్తి

—పరమయోగివిలాసము - పుట 206 క్రీ. శ. 1540.

ఆశు మధుర చిత్ర విస్తారములు. 1-11

—పింగళి సూరన - కళాపూర్ణోదయము క్రీ. శ. 1560.

ఆశువు, మధురము చిత్రము, విస్తరము నా చతుర్విధకవితలు

గణపవరపు వేంకటకవి - క్రీ. శ. 1676.

చిత్ర విస్తర మధురాశు లీల కవితల్ రచియింపఁగ నేర్చె (2-54)

—శేషము వేంకటకవి తారాశశాంకవిజయము. క్రీ. శ. 1720.

---

1. నైషధము సర్వంకష వ్యాఖ్యానమున నీ విషయము తెలుపఁబడలేదు.

తెలుఁగు లాక్షణికులలో వారికిని రఘునాథయ్యయను కవి లక్షణదీపిక'[1] అను గ్రంథములో నీ కవితాస్వరూపములను చక్కఁగా వివరించినాఁడు. ఇతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడు కాదగును.

"ఆశు మధుర చిత్ర విస్తార కవిత్వంబుల నివి విలసిల్లె, అందు

ఆశుకవిత్వంబన్నది :—

ఏకపాద త్రిపాద కఠినప్రాస విషమసమస్యాపూర్తులు వ్యస్తాక్షరీసంఘటిత పద్యంబులును, ఇష్టార్థదేవతా వరప్రతిపాది నిషేధాక్షర రచనాచమత్కృతియు, అష్టావధానంబులు, ఘటికాశతగ్రంథకల్పనయు, ఆకాశపురాణంబులని తత్కాలోచితాతిత్వరితగతిని రచియింపఁబడునది యాశుకవిత్వంబును,

మధురకవిత్వంబన్నది :—

నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యధిదేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్టొట్లు. గీతప్రబంధములు, చతుర్భద్రిక అష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, జయఘోష, చతురుత్తరసంఘటనలు యక్షగానంబున నెలయు పదంబులు, దరువులు, లీలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాలజోలలు. జక్కులరేకుపదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద చతుష్పదషట్పదాష్టపదులు, నివియాదిగానన్నియు లయప్రమాణంబులనొప్పి, మృదుమధుర వచనరచనలఁ బ్రసిద్ధంబైనయవి మధురకవిత్వంబులు.

చిత్రకవిత్వంబన్నది :—

పాదగోపనంబును, పద్యభ్రమకంబును, పాదభ్రమకంబును, నామగోపనంబును. అనులోమ విలోమ గతి పద్యంబులు కందగీత

---

1. లక్షణదీపిక అముద్రితము మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలో గలదు. వ్రాతప్రతి-సంఖ్య డి. 1929. ఈ గ్రంథమును క్రీ. శ. 1740 ప్రాంతముల విలసిల్లిన కస్తూరిరంగకవి ఆనంద రంగరాట్ఛందస్సు" అను గ్రంథమున దీని నుదాహరించి యున్నాఁడు. గ్రంథమున నుదాహృతులైన కవులను బట్టి కాలనిర్ణయము చేయఁబడినది.

గర్భితవృత్తంబును, కందద్వయ గర్భితమణిగణ నికరంబును, క్రౌంచ పదగర్భిత కందద్వయంబును, ద్విపద, చౌపద లాలి సువ్వాల మంగళ హారతి ధవళంబులు శోభనార్థ చంద్రికాది పదదర్వులాది లయ గర్భితసీసంబును, కంకపటహహుడుక్కాక తురంగనట భేరీనినాద నాలుక రంపవృత్తంబులును, ఓష్ఠ్య నిరోష్ఠ్య, సంకరజిహ్వా అచలజిహ్వా వృత్తంబులును, రగడ భేదంబులును, తాళగతులును దండక వృత్తంబులును, అష్టదళ, షోడశదళ, ద్వాత్రింశద్దళ పద్మబంధంబు లును నవావరణ ద్వాదశావరణ చక్రబంధబులును రథ, నాగ, ద్వినాగ, కులాలచక్ర, ఆందోళికా ఛత్త్రబంధంబులును గోమూత్రికా, పుష్ప మాలికా, పుష్పగుచ్ఛ, మృదంగ డమరు ఖడ్గ త్రిశూల, కంకణ సర్వ తోభద్ర, కవికల్పిత కల్పవల్లరి నివి యాదిగాగల్గు బహువిధచమ త్కారంబుల చిత్రంబులు రచియించుటంజేసిన నిది చిత్రకవిత్వము.

విస్తర కవిత్వంబన్నది :—

ఇష్ట దేవతా ప్రార్థనయు, కృతికర్తవంశావళియు, పుర, గిరి, మృగయాయాత్రవనజలనిధి వర్ణన, ద్యూతవినోద, గాయబార, వివా హోత్సవ సురతక్రీడ పుత్రోత్సవ, సూర్యోదయ సూర్యాస్తమయ, చంద్రోదయ చంద్రోపాలంభన విరహావర్ణనలు, షడృతువుల వర్ణ నలు, జలక్రీడలు; మధుపాన, దండయాత్ర రణక్రీడ దిగ్విజయంబులు నివియాదిగా గలుగు సప్తాదశవర్ణనలు అలంకారములు, రీతులు, శయ్యలు, వృత్తులు, పాకంబు లుత్ప్రేక్షలు శ్లేషోల్లేఖలు, ధ్వనులు, వ్యంగ్యంబులు నివియాదిగాగలుగు కావ్యలక్షణంబులు గలిగి పంచ లక్షణ దశలక్షణంబుల నొప్పి, కథానరణి వర్తిల్లుటంజేసి యది విస్తర కవిత్వంబన్నది మహాప్రబంధంబు.

ఇట్టి కవిత్వంబు కావ్యలక్షణంబునంజెప్పిన వాక్యపదదోషం బులు, చతుర్వింశతి దోషంబులు పరిహరింపవలయు. దోషంబులు వర్జించి, కవిసమయ సిద్ధప్రయోగంబు లరసి, అభినవకావ్యంబుపక్ర మించునతడు భారత భాగవత రామాయణానేక పురాణ ప్రసిద్ధంబు లైన యితిహాసంబునంగల కథ విస్తరించుట యూహపరసాధనంబని

మహాకవిశ్రేష్ఠులకభిమతమగు కవిత్వరచన సన్మార్గంబు ... (ప్రథమాశ్వాసము)"

ఇక నీవిభాగ మెందుండి గ్రహింపఁబడినదో తెలిసికొనుట యావశ్యకము- సంస్కృతమున నీ విభాగము లేకుండుటచే తెలుఁగువారం దుండి గ్రహింపలేదనుట నిర్వివాదాంశము. కావున నిది సుసంస్కృతమైన దేశిపద్ధతిపై ననే విభాగింపఁబడియున్నట్లూహింపనగును కన్నడ భాషలో నిట్టివిభాగము లేదు-తమిళమున క్రీ.శ.12 వ శతాబ్దమునుండి ప్రసిద్ధిగాంచిన"పాట్టియల్" అనుగ్రంథములో ఆశు, మధుర, చిత్తర విస్తరె అని యీవిభాగము తెలుపఁ బడియున్నది. మఱియు నంతకుఁ బూర్వము, అనగా దశమ శతాబ్దికి పూర్వమే విలసిల్లిన యాళ్వారులలో నొకనికి మధురకవినామముండుటచేతను నిది ద్రవిడ లేక తమిళ సాహిత్యమున చిరకాలమునుండి సంప్రదాయసిద్ధముగానున్నది. కన్నడమున 'భిక్షాటన' కావ్యములో క్రీ. శ. (1550 లో) నొక కవి వీనిని పేర్కొనినాఁడు. తెలుఁగున 10 వశతాబ్దికి ప్రచారములోనుండుటచేతను, నంతకుముందు తమిళమున ప్రచారమునుండుట చేతను, నీ విభాగము, కేవలము తమిళమునుండి, తెలుఁగువారు గ్రహించిరనుట కాధారములు లేకపోవుటచే నిది, దాక్షిణాత్య సాహిత్యమునకుఁ బూర్తిగ సంబంధించినదనియు, నిది దేశికవితలలోనే తొలుత వర్ధిల్లినదనియు చెప్పనగును.

పైని యుదాహరించిన భాగము ననుసరించి, ఉదాహరణములు మధుర కవితాశాఖకుఁ జెందిన వనుట స్పష్టము గదా!

మార్గదేశి భేదములచే రెండు విధములుగా నేర్పడిన సంప్రదాయములలో నుదాహరణములు పై విభజనమునుబట్టి దేశిసంప్రదాయమునకు సంబంధించినవిగా నెన్ననగును. మధుర కవితలోఁ జెప్పఁబడిన యక్షగానములకు నీయుదాహరణములే మూలమని చెప్ప నొప్పును. ఉదాహరణములలో నియతముగాఁ బ్రయుక్తములగు రగడలు యక్షగానమున కొలది మార్పులతో నుపయుక్తములగును. అప్పకవి యీ విధానము నిట్లు తెలిపినాఁడు:—

యక్షగాన లక్షణము :—

సీ॥ తుద నేడు లఘువులు తొలఁగించి చదివిన
త్రిపుటకు వృషభ గతి పదయుగము
లలిగడపల నొక్కలఘువు మానిన జంపె
మను ద్విపదగతిసమ పదయుగము
గురుతగు రచ్చ రేకుఁ దురగ వల్గనా
హ్వయ మేక తాళి యా మధురగతికి
సంక్షిప్త కీర్వదినాలుగట తాళమున మాత్ర
లోలి విశ్రాంతి ప ద్మాలుగింటఁ

గీ॥ దెలియనర్థంబు నర్థ చంద్రికలు పీన
యక్షగానప్రబంధంబు లతుకవచ్చు
రగడ భేదంబు లివి యంద్రు రసఁగవీంద్రు
లవిత నిజసేవకస్తోమ ! యబ్ధిధామ !

(4-ఆ-304)

పైని రగడలు తాళమున కెట్లు సరిపోవునో 'ఛందస్సు-రగడలు' అను శీర్షిక క్రిందఁ జూడనగును.

---

# వ్యాకరణము - విభక్తిప్రత్యయములు

ప్రథమాది సప్తవిధవిభక్తుల నుదాహరించుచు నియతములగు నక్షరగణములతో కూడిన యొక వృత్తమును, లేక పద్యమును ననియతములగు మాత్రగణములతో కూడిన యొకపద భేదమును గూర్చి చెప్పఁ బడినవి కావుననే వీనికి యుదాహరణములని పేరు వచ్చినది. ఈ యుదాహరణస్వరూపము, మనకుపలబ్ధములైన కావ్యవాఙ్మయమునకంతకు మూలమని నేఁటికి మనకుపలబ్ధములైన కావ్యములలోని లక్షణములు తెలుపుచున్నవి. కావున తెలుఁగున సాహితీపరిణామమును దెలిసి కొనుటకు నీయుదాహరణగ్రంథము లత్యంతోపయుక్తములు.

విభక్తులు కేవలము వ్యాకరణశాస్త్రమునకు సంబంధించినవే యైనను, విభక్తిప్రత్యయముల పరస్పరసంబంధ మాశాస్త్రమువలననే తెలియదగినదే యైనను, తెలుఁగున మాత్రము వ్యాకరణశాస్త్రమునకు సాహిత్యమునకు నవినాభావసంబంధముగలుగఁ జేసినవి యుదాహరణములు. తెలుఁగు భాషలోని కావ్యరచనాప్రణాళికను గమనించిన మనకీవిషయము స్పష్టముకాఁగలదు. తెలుఁగుకృతులలో ప్రాచీనమున ప్రాయికముగా గద్యపద్యమిశ్రితములగు చంపువులు వెలసినవి. సాహితీపథకమున నుత్తమశ్రేణికిఁ జేరఁదగినగ్రంథము లన్నియు నీ చంపూపద్ధతినే రచితమగుటచేత, సారస్వతమునవిలసిల్లిన, శతకయక్షగాన ద్విపదోదాహరణాది రూపముల రచితములైన గ్రంథములను, లక్ష్యలక్షణవివేచనము గావించినపుడు లాక్షణికు లంతగాపాటింపరైరి. కావున కావ్యరచనాపద్ధతినుండియే యుదాహరణములెట్లు, విభక్తి ప్రత్యయవిషయమున, విశిష్టతఁజూపినవియు వివరించెదను.

ఉదాహరణములు సాధారణముగ దైవపరములుగను, క్వాచిత్కముగ మానవపరముగను నుండును. కావ్యములును నంతియే. తెలుఁగున, సాధారణముగ, దైవమునకుఁగాని, రాజునకుఁగాని, గురువునకుఁగాని యంకితముగాసికృతి యుండనేరదు. కావున యంకితమునకంగములుగ తెనుఁగుకావ్యములలో కృత్యవతరణికయం దీక్రింది లక్షణములు గలవు :—

1 ఇష్టదైవస్తుతి. 2 కవితాప్రశంస. 3 సుకవిస్తుతి. 4 కుకవినింద. 5 కృతిపతికీర్తనము. 6 కవిస్వవిషయము. 7 కృతిపతివర్ణన. 8 కవివంశవర్ణన. 9 షష్ఠ్యంతములు. 10 కథాభాగమంతయునాశ్వాసములుగావిభాగింపఁబడి, ప్రతియాశ్వాసము చివర కృతిపతిప్రస్తావన (సంబోధన) లేక విభక్తిభేదము, 11 కవిగద్య స్వవిషయము. 12 ప్రథమాశ్వాసముగాక, తక్కిన యాశ్వాసప్రారంభములలో నొక సంబోధనము.

పై కృత్యవతరణికలోను, ఆశ్వాసాద్యంతములలోను, ఇష్టదేవతాస్తుతి, షష్ఠ్యంతములు, కృతిపతివర్ణన, ఆశ్వాసాంత పద్య

రచనయందున వివ్యాకరణమునకును సందు ముఖ్యముగ విభక్తులకు సంబంధించినవి. ఏలయనఁగా మన తెలుఁగుకృతులలో నంకితములు రెండువిధములు. 1 సంబోధనాంతములు. 2 విభక్త్యంతములు. వీనిలో విభక్త్యంతములు చాలతక్కువ. ప్రాయికముగ సంబోధనాంతములే యెక్కువ. కాని విభక్త్యంతములు మనప్రాచీనసంప్రదాయమును తెలిసికొనుటకు నుపయుక్తమగును. మన కుపలబ్ధములైన ప్రాచీనములైన తెలుఁగుకృతులలో నన్నయరచితమహాభారతము మొదటిది. దానితరువాతి కొలఁదికాలముననే వెలసిన నన్నెచోడ కవికుమార సంభవము రెండవది. తరువాతి నెన్నియోకావ్యములు వెలసినవి. వీనిలోఁ గొన్ని విశేషలక్షణములు కన్పట్టుచున్నవి. 1 కావ్యము 'శ్రీ'తో ప్రారంభమగుట. 2 కావ్యాదియందు సంస్కృతశ్లోకము. 3 కావ్యాంతమున మంగళమహాశ్రీ వృత్తము.

కావ్యములలోని పై లక్షణములు కొన్ని యుదాహరణములలో వెలసియున్నను, ఉదాహరణములలోని కొన్నిలక్షణములు కావ్యములకు ముందుగా వెలసిన పద్యమయశాసనములందు వెలయుటచే, నుదాహరణములవెనుకనే కావ్యములలో నీలక్షణములు పాటింపఁబడెనవి నిరూపింపవచ్చును.

కృతినిచ్చిన యభీష్టదైవతవాచకపదమునకో మహాపురుషవాచకపదమునకో, విశేషములు చేర్చినపుడు, విశేష్యమునకున్న విభక్తియే, విశేషణములకుఁ జేర్చుట తెలుఁగుభాషాసంప్రదాయము. ఈ సంప్రదాయము సంస్కృతము ననుసరించినదియే. సంస్కృతమున విశేష్యమునకు, విశేషణమునకును తత్సమానవిభక్తిప్రత్యయము చేర్చుట సంప్రదాయము. కాఁబట్టియే యాశ్వాసాద్యంతములలో సంబోధనలున్న సంబోధనలును, విభక్త్యంతములుగానున్న విభక్త్యంతములతోడను రెండుపద్ధతులేర్పడినవి. మరియు, కృతిపతికిని, కథానాయకునికి యభేదవ్యవసాయము చేసినప్పు డీపద్ధతితప్పక పాటింపఁబడవలెను. అట్లుకానిచో కథావస్తువునందలి ఘట్టములకుఁ బరస్పరా

న్వయముకుదురదు. పై విషయమును స్పష్టపఱచుటకు నన్నయ నన్నె చోడ మహాకవులకావ్యములనుండి లక్ష్యములను చూపుచున్నాఁడను.

నన్నయ తొలుత సంస్కృతశ్లోకముతో నారంభించి, శ్రవ్య కావ్యమునకు దృశ్యకావ్యమువలె మంగళాశాసనము గావించినాఁడు. ఆ వెనుక "రాజకులైకభూషణుఁడు ... ... సర్వలోకాశ్రయుఁ డాది రాజనిభుఁడు ... ... విష్ణువర్ధనుండు వంశవర్ధనుండు" అని ప్రథమా విభక్తి విశేషణములతో ప్రారంభించి, "అయినను దేవా! నీయను మతంబున .. . నా నేర్చువిధంబున నికావ్యము రచియించెద"నని భారతము ప్రారంభించినాఁడు.

కావ్యకథా ప్రారంభమున సంబోధనకలదు కావున, ప్రథమా శ్వాసము సంబోధనలతో ముగించినాఁడు.

ఉ॥ రాజకులాగ్రగణ్య! మృగరాజపరాక్రమ! రాజరాజ! వి
భ్రాజితశుభ్రకీర్తి పరిపాండురసర్వదిగంతరాళ! ఘో
రాజిముఖోపలబ్ధవిజయప్రమదాశ్రిత బాహుదండ! ని
స్తేజితవైరివీర! కులదీప! మృడప్రియ! విష్ణువర్ధనా!

క॥ ఆదిక్షత్త్రచరిత్ర! ధ,
రాదేవాశీః పరంపరావర్ధితని
త్యోదయ! సత్యోదిత! విమ
లాదిత్యతనూజ! విక్రమాదిత్యనిభా!

తోటకము—నిరవద్యన రేశ్వర సిత్యనిరం,
తరధర్మమతీ! గుణధామ! జగ
త్పరిపూరిత కీర్తివిభాసి! విభా
కర తేజ! నృపోత్తమ! కాంతినిధీ!

ద్వితీయాశ్వాసము మొదల—

శ్రీవనితావల్లభ! వేఁ
గీవిషయాధీశ! కావ్యగీతిప్రియ! నా
నావనినాథకిరీటత
టీవిలసద్రత్న సంఘటిత పదకమలా!

అని సంబోధనతో ప్రారంభించినాఁడు. ఇట్లే నన్నయరచిత భాగమం దంతటను గలదు.

భారతావతరణికలో, రాజరాజు, తనకు పాండవోత్తముల చరిత్ర వినవలయు నని కుతూహలముగావున తెనుఁగున రచియింపుమని యానతిచ్చినాఁడు. ఇచ్చట 'నాకు వినవలయునని' రాజరాజు చెప్పియున్నాఁడే కాని, తరువాతిరాజులవలె, నాకుఁ గృతినొసంగుమని యనఁగా నంకితముసేయుమని కోరకుండుటచే, నిచట తరువాతి తెలుఁగుకావ్యములలోనున్న షష్ఠ్యంతము లుండవలసిన యవకాశము లేదు*. ఇచ్చట నన్నయ 'లోకజ్ఞత' యెంతయుఁ బ్రస్ఫుటమగుచున్నది. 'నాకు వినన భీష్టము' అని రాజరాజుచేఁ బలికించినను, నచ్చట 'నాయొక్కనికే' అను నహంభావద్యోతకమగు నభిప్రాయ మెంతమాత్రమును లేక, 'నాయొక్క ప్రజల కందఱకును' ననఁగా తెనుఁగువారందఱకును, నను మహోదారాశయము రాజరాజునందు వ్యక్తమగునట్లుగా నన్నయ రచించియున్నాఁడు. ఇచ్చట సభలో రాజరాజుకూడ నొక శ్రోతయే. ముఖ్యశ్రోత కాని నిశ్చయముగా కృతిపతి కాఁడు. శ్రోతయే ప్రధాన పురుషుఁడు కాబట్టి, కావ్యముతోపాటు కవియొక్కయు, కథాశ్రోత యొక్కయు కీర్తులు శాశ్వతముగ నుండును గావునను, శ్రోతయొక్క వ్యక్తివిశేషమును వర్ణించుట సమంజసమే కాక యావశ్యకముకూడ నగుచున్నది. నన్నయకావ్యమునందలి యీలక్షణమే శివకవులయందు పాల్కురికి సోమనాథుఁడు తన ద్విపదకావ్యములయందు పాటించి వానికి చంపూకావ్యపద్ధతినుండు భారతాదులతో సమానప్రతిపత్తి గడించినాఁడు. నన్నయ రాజరాజు కుల, వీర్య, శౌర్య, గుణాదికము వర్ణించినట్లు, పాల్కురికి సోమనాథుఁడు తనకావ్యములకు శ్రోతలగు గొబ్బూరి సంగనామాత్యుని, గోడగి త్రిపురారిని, పాల్కురికి సూరనామాత్యుని వారివ్యక్తివిశేషాదులను వర్ణించినాఁడు. కాఁబట్టి నన్నయ రాజరాజునకు, తరువాతివాఁడనుకొనినట్లు, తనకృతి నాతనికంకితము చేయలేదనియు, 'నీకు భారతముఁ జెప్పెదనని' షష్ఠీవిభక్తిలోఁ జెప్పక,

*షష్ఠ్యంతములు కేవల వ్యక్తిపరములు.

"దేవా! నీ యనుగ్రహంబున" నని సంబోధనతోఁ జెప్పుటచేత, శ్రోత గానే యెన్నుకొనెననియు స్పష్టమగుచున్నది. 'నీకు' అని చెప్పినపుడది కేవలము వ్యక్తి - అనుగుచున్నది 'నీ యనుగ్రహమున తెనుఁగులో రచియించెద' నని చెప్పినపుడు, తెనుఁగు భాషను మాటలాడుప్రజలం దఱి కొఱకును రచియించితిననియు, నీవు రాజవుగావున, దైవస్వరూపుఁడవుగావున, నీవు దీనిని విని ప్రజానీకములో వ్యాప్తినొందింపు మనియు నన్నయ భట్టారకుని యభిప్రాయమైనట్లు స్పష్టము. కావున నేఁడు కొందఱు, తెలుఁగు కావ్యములన్నియు, రాజాంకితములనియు, కేవలవ్యక్తిపరములనియు, ప్రజాసామాన్యముకొఱకుద్దేశించి వ్రాయఁబడినవి కావనియు, రాజులయుత్కర్షకొఱకే కవులు వ్రాసిరనియు తలంచి, విమర్శించుట యెంతమాత్రమును సరికాదని యెన్నవగును. కాఁబట్టి నన్నయ భారతమున షష్ఠ్యంతములుండ నవకాశము లేదని సారాంశము.

ఇఁక నన్నిచోడని కుమారసంభవ కావ్యమునందలి యాశ్వాసాంత విషయములను జూడుఁడు. కుమారసంభవము నన్నిచోడని గురువగు జంగమ మల్లికార్జునున కంకితము. ఇచ్చట కవి, కృతిపతి యగు జంగమ మల్లికార్జునునకు, శ్రీశైలమల్లికార్జునునకు నవగా శివునకు నభేదవ్యవసాయము చేసినాఁడు. నన్నిచోడమహాకవి, యిష్టదేవతాస్తుతినొనరించి, యావెనుక గురుప్రశంసకావించి, "సద్గురుండైన జంగమ మల్లికార్జున దేవునకున్, క. శ్రీకంఠ మూర్తికమలశ్లోకునకు . మల్లికార్జునమునికిన్. పరమభక్తి యుక్తినావర్జితహృదయుండనై ... ... నాచెప్పంబూనిన దివ్యకథామాత్రం బెట్టిదనిన" అని షష్ఠ్యంతముగా బేర్కొనుటచేత షష్ఠ్యంతములు చెప్పినాఁడు. ఇచట షష్ఠ్యంతములు వేఱుగా నేల చెప్పవలయుననిన, నన్నిచోడని కావ్యమున షష్ఠ్యంతములతోనుండు విశేషణములు లేక నామావళులు, నన్నిచోడని కాలమున పద్యమయశాసనములలో కూడ కానవచ్చుట చేత, నాతఁడాసంప్రదాయమును నొకప్రత్యేకవిషయముగ తనకావ్యమున నెలకొల్పెనని యూహింపఁదగును. ఈ నామావళిసంప్రదా

యము ననుసరించి నన్నెచోడుఁడు షష్ఠ్యంతములు వ్రాయుట యావశ్యకమేయగుచున్నది.

పద్యమయశాసనములలో నీవిభక్తిప్రత్యములు పాటింపఁబడినట్లుగా ననేక యుదాహరణము లీయవచ్చును. ఒక్కొక్క విభక్తితో తాను స్తుతించు మహాపురుషుని గుణములను, విశేషణములుగఁ జెప్పు వానినే నామావళు లందురు.

ప్రథమావిభక్తికి:—క్రీ.శ. 1108 కొమ్మనాని శాసనము.

ఉ॥ శ్రీరమణీయుఁ డర్థిజనసేవ్యుఁడు భవ్యుఁడు దివ్యమూర్తి శౌ
ర్యారభటీధురాతినిశితాసి విదారిత శత్రువర్గుఁ డా
ధారిత బంధు మిత్ర జనతామణి గొంకనరేంద్రు మంత్రి ప్రో
త్సారిత లోభమోహావృతి సత్త్వుఁడు ప్రోలఁడు ధన్యుఁ డున్నతిన్.

క॥ శ్రీరాజప్రోలిశాసనుఁ
డారాధిత నీలకంఠుఁ డభినవమదనా
కారుఁడు ప్రోలఁడు విబుధా
ధారుండన పొన్నరాంబతనయుఁడు నెగడన్.

ద్వితీయావిభక్తికి:—క్రీ.శ. 1132. మారపండని శాసనము

సీ॥ లాటవిలాసినీ లాలాట తిలకుని
గేరల కరలీల కేళిపద్మ
గర్ణాట సుందరీ కర్ణావతంసుని
కుంతలీ కుంతల కుసుమదాము
గౌడ సతీనేత్ర కాలాంజనుని వంగ
భామా కపోలా స్తపత్రరచను
నేపాల కామినీ నీరంధ్రకుచహారు
నంధ్రీ తనూకుంకుమాంగరాగు
రమణతో నాదిదానుల రాశికెక్కి
దీనజనముల కూడ తెల్ల దీర్చుచున్న
అనఘు చారిత్రు మారపండని నతగిలి
పొగడవిందుము నెల్ల భూభుజుల సభల.

తృతీయావిభక్తికి:—క్రీ.శ.1161. శరణయ తిపూర్ణపురశాసనము.

శ్లో॥ శ్రీజయలక్ష్మి ... పరమండలి కాన్వయాబ్జరే ... హిమధామః
వైభవజితమహేంద్రో జయతి కులోత్తుంగ చోడగొంకనరేంద్రః

ఇట్టి గొంకరాజుల కిష్ట భృత్యుండైన సరణయనామావళి యిట్టిదె.

ఉ॥ శ్రీవిలసద్విలాస జితజిష్ణునిచే నహిం (హరి?) సీమకృష్ణుచే
దేవసమానుచేత నరదేవశిఖామణిచేత భాస్వవా
టీవరవృత్తిశాసన పటీయసినాంటగి మేలునాయక
శ్రీవిభుఁడొప్పె జోత యువశీకృతసజ్జనలోకుఁడై భువిన్.

వెల్లకి గంగాధర మంత్రి కరీంనగరశాసనము.

— తెలింగానాశాసనములు.

స్ర॥ శ్రీ శాంతాకాంతుచే నాశ్రితవిబుధజనాళిః స్థిరప్రాజ్యరాజ్య
శ్రీకాంతాకాంతుచే విస్తృతనిజభుజ నిస్త్రింశనీతాన్యరాజ
శ్రీకాంతా కాంతుచే దిక్క్షితి గగన సమాశ్లిష్ట విస్పష్టకీర్తి
శ్రీకాంతా కాంతుచే నూర్జితరిపుమృగరాజీమృగారాతిచేతన్.

చ॥ పరనరపాలమౌళిమణి భాస్వరదీప్తిలతానితాంతవి
స్ఫురితపదాబ్జుచే, నహితభూతలనాథవరూథినీసరో
వరమథనప్రభూతమదపద్విరదాధిపుచే, విరోధిభూ
ధరశిఖరప్రభిన్నవిదితత్రిదశేంద్ర నిశాతహేతిచేన్.

క॥ సురకరిపతి, మృగపతి, హరి
సురసతిధవళసరసిరుహ-శుక్తిరుహసదృక్
సురుచిరవిశద యశోభా
సురనిధిచే సుకవితరణి సురనిధిచేతన్.

క॥ శరనిధిపరీతధాత్రీ
పరిపాలితదక్షిణప్రభాసితభుజవి
స్ఫురుచేత నన్నకొండా
పురనాథుండైన రుద్రభూపతిచేతన్.

చ॥ వెలయ నమాత్యసంపదలు ... ... దగువృత్తులంబడసి.

పంచమీవిభక్తికి:—క్రీ.శ. 1132. భీమరాజు శాసనము

ఉ॥ అందు గిరీశుకంటె సుభటాగ్రణి, యర్కజుకంటె దాని శ్రీ
నందనుకంటె రూపి, సురనాథునికంటె విలాసుఁడాపగా
నందనుకంటె శౌచి, నలినప్రియుకంటె ప్రతాపి, దండభృ
న్నందనుకంటె సూనృతుఁడనందగు భంగి ధరాతలంబునన్

సంబోధన:—క్రీ.శ. 1161. శరణయ శాసనము.

వసంతతిలకము—శ్రీరామ రామ నృపశేఖర విష్ణుమూర్తీ!
వీరాగ్రగణ్య భుజవిక్రమ పార్థివేంద్రా!
మారారి యంఘ్రియుగమానసరాజహంసా!
కారుణ్యదాస సహకార మహీజరాజా!

తెలుఁగుకావ్యములలో నీ విభక్తులు పద్యరచనయం దుప యోగించి ప్రాచీనులైన తెలుఁగుకవులు నొక విశిష్టమగు సంప్రదాయముగా పాటించిరి. పద్యము మొదలుగా నొకవిభక్తితో ప్రారంభించి దానితో పద్యమును చివరవఱకు నడిపించిన, నది శ్రుతిమనోహరమై, సహజముగా చెవుల కింపగు తెలుఁగుభాషాకవిత్వమున కొక వన్నె తెచ్చుచున్నది దీని కెన్నియో నిదుదాహరణములు చూపఁదగును. సాధారణముగా చంపూకావ్యములన్నియు సంబోధనాంతములు. ద్విపదలలోఁ గొన్నింటియందును యక్షగానములలోను ద్వితీయాంతములు. శతకములు- సంబోధనాంతములు. చంపూకావ్యములలో సంబోధనాంతములుకాక విభక్త్యంతములుగా నుండుట తెలుఁగు భాషలో నీక్రింది కావ్యములలో గలదు:—

1. నన్నెచోడని-కుమారసంభవము,

2. భాస్కరుని-అరణ్యకాండము.

(భాస్కరరామాయణమున)[1]

3. కేతన-దశకుమారచరిత్ర

4. తిక్కన-నిర్వచనోత్తర రామాయణము

5. మంచన-కేయూరబాహుచరిత్ర

6. కొరవి గోపరాజు-సింహాసనద్వాత్రింశిక

7. విన్నకోట పెద్దన- కావ్యాలంకార చూడామణి

8. పరవస్తుచిన్నయసూరి - శబ్దలక్షణ సంగ్రహము [2]

ఈ సంప్రదాయము నవీనుఁడగు చిన్నయసూరి పాటించినను, పదునాల్గవశతాబ్దము తరువాత పాటింపఁబడలేదని పై పట్టికయే తెలుపఁగలదు.

ఏదేని యొక్కొక విభక్తితో పద్యము ప్రారంభించిన నా పద్యము కడపటికు నావిభక్తి ప్రత్యయముతోడనే పూర్తిచేయుట యను పద్ధతి శాసనములయందు ముందు మనము చూచియున్నారము. ఈపద్ధతియే క్రమముగా కావ్యములలో నొక విశిష్టసంప్రదాయముగా పరిణమించి, నిసర్గమనోహరమగు తెలుఁగుభాషారీతికి నిరుపమాన శ్రుతిసౌఖ్యము నొడగూర్చినది.

ఇఁక మన కావ్యములనుండి యుదాహరణములఁ జూపెదను.

ప్రథమావిభక్తి:—నన్నయ భారతము- తొలి తెలుఁగుపద్యము-

ఉ॥ రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి, శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజిత భూరి భుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

---

1. ఆంధ్రపత్రిక-విక్రమసంవత్సరాదిసంచికలో 'భాస్కర రామాయణ సమస్య' అనువ్యాసమున డాక్టరు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు, ఆంధ్ర గ్రంథములలో విభక్త్యంతముల నాశ్వాసాద్యంతంబులఁ బ్రయోగించినకవులు మువ్వురు: నన్నెచోడుఁడు-తిక్కన-కేతన" అని వ్రాసియున్నారు. పుటలు (57-69)

2. ముద్రణము. 1853

ద్వితీయావిభక్తి [1]:—పోతనభాగవతము సప్తమస్కంధము ప్రహ్లాద చరిత్ర-

చ॥ వెఱచినవాని, దైన్యమున వేడుఱు నొందినవాని, నిద్రమై
మఱచినవాని, సౌఖ్యమున మద్యము ద్రావినవాని, మగ్నుడై
పఱచినవాని, సాధుజనభావమువానినిఁ గావు మంచువా
చఱచినవానిఁ గామినుల జంపుట ధర్మము గాదు ఫల్గునా!

తృతీయావిభక్తి :—శ్రీనాథుఁడు-శృంగారనైషధము—

చే ఉ॥ హాటకగర్భుచేత కమలాసను చే

ప్రత్యయము చతురాస్యకంఠశృం
గాటకవీథి కాకృతి విగాహ
చతుశ్శ్రుతిచేత, దేవతా
కోటికిరీట సంఘటిత
కోమలపాదసరోజుచే జగ
న్నాటకసూత్రుచేత కృతి
నాథుఁడు గాంచు చిరాయురున్నతుల్.

తో [2] మ. భటసంఘంబులతో, రథావళులతో,

ప్రత్యయము భద్రేభయూథంబుతో
పటువేగాన్విత ఘోటక వ్రజముతో
బంధు ప్రియశ్రేణితో
గటునరంభముతో విదర్భతనయన్
గైకొందు నంచున్ విశం
కటవృత్తిన్ జనుదెంచె చైద్యుఁడు
గడున్ గర్వించి యావీటికిన్

—పోతన భాగవతము - దశమస్కంధము - రుక్మిణీ కల్యాణము.

---

1. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పై
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁడొకఁడు...... —భాగవతము దశమస్కంధము.

2. చూ. పారిజాతాపహరణము - 5-45. మించుపల్లి - తెలుఁగు పొలుపు. పుట 45-27 పద్యము.

చతుర్థీ విభక్తి :—

చ॥ విరహిత వైరికై, భువన విశ్రుత సద్గుణ రత్నహారికై
నిరుపమకీర్తికై యువతి నిర్మథ నతనుచారుమూర్తికై
విరచితవృద్ధికై సమర వీర విరాజిత జైత్రసిద్ధికై
పరిచితశక్తికై గిరిశపాదసరోజనిషక్త భక్తికై.

—కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన.

క॥ పరగండభైరవునకై
అరి మానన చండడిండి మారావునకై
కరవాలభైరవ ఫ్రూర్జిత
బిరుదునకై నతవిమతనిభృతవరదునకై.

తరల - సుజనపోషణశాలికై రణశూరతావనమాలికై
రజనినాథకులాగ్రగణ్యవిరాజికై జయవాజికై
గజభుజంగమభారవారణ కారికై యవికారికై
విజయవిక్రమధర్తకై మనవిశ్వభూవరభర్తకై.

(షష్ఠోల్లాసము 144, 145, 146.)

సప్తమోల్లాసము.

క॥ శ్రీవిశ్వేశ్వరునకునై, భావితవిశ్వేశ్వరాంఘ్రిపద్మునకై సం
భావితపదవాక్యకళా, కోవిదుకై నయవిశేషగుణ విదునకునై.

౧ వ పద్యము.

పంచమీవిభక్తి :—కేతన - దశకుమార చరిత్ర. 1 ఆ.

ఉ॥ కర్ణునికంటె దాత, రతికాంతునికంటెను సౌమ్యమూర్తి దృ
క్కర్ణకులాధినాయకున కంటెను ...
షష్ఠ్యంతములు - కావ్యములలో నియుతములు.

షష్ఠీవిభక్తి :—పోతన భాగవతము - కృత్యాది -

సీ॥ ఆణిముత్యాలతో, అలకేల్పుతేనెతో,
మంచుతో మేటిరాయంచతోడ. - 47 పుట.

సప్తమీవిభక్తి :—నన్నయ-ఆదిపర్వము 5-139.

లయగ్రాహి—చందనతమాలలతలందు నగరుద్రుమము
లందు కదళీవనము లందు లవలీ మా
కంద తరుషండముల యందు వనిమీలదర
విందసరసీరుహము లందు వనరాజీ
సందళితపుష్పమకరందరసముం దగులు
చుందనువు సౌరభము. ...

స్థాలీపులాకన్యాయమున గొన్ని చూపితిని గాని ఇట్టి యుదాహరణములు లెక్కకు మిక్కిలిగాఁగలవు.

సంబోధన :—ఆశ్వాసాద్యంతములు

చంపువులయందును శతకములయందును సంబోధనాంతములే యున్నను, దేశిరచనములగు ద్విపదలయందును, యక్షగానముల యందును ద్వితీయాంతములు వెలసిన వనుట కుదాహరణములు చూపుచున్నాఁడను. ఇదియును దేశి వాఙ్మయమునై కావ్యవాఙ్మయ ప్రభావమెంతవఱకుఁ బ్రసరించినదో తెలిసికొనుట కుపయుక్తమగును. తొలుత ద్విపద కావ్యములయందలి కొన్నిటిఁ జూపి వివరించెదను.

మన కుపలబ్ధములైన ద్విపదలలో పాల్కుఱికి సోమనాథుని బసవపురాణము మొదటిది - దీనియందును, సోమనాథుని ద్వితీయ ద్విపదకృతి పండితారాధ్య చరిత్రమునను నాశ్వాసప్రకరణాంతముల సంబోధనాంతములు కలవు. కాని తరువాత వెలసిన ద్విపదకృతులలో ప్రాయికముగా ద్వితీయాంతములే కానవచ్చుచున్నవి. రంగనాథ రామాయణము వీని తరువాత ద్విపదకృతులలో మొదటిది. అందులో కాండాంతములలో—

"ద్వి॥ అని యాంధ్రభాష భాషాధీశనిభుఁడు
.... .... ....
భూలోకనిధి కోనబుద్ధ భూవిభుఁడు
తిమ్మసింగ విఠ్ఠలధరణీశు పేర

కమనీయగుణధైర్య కనకాద్రి పేర
ఘనిబూని పరగిండ భైరవు పేర
.... .... ....
కరమర్థి . ... ... కాండంబు సెప్పె."

అని ద్వితీయాంతము లే గలవు. తరువాతికృతి మడికిసింగన భాగవత దశమస్కంధము ద్విపద - ఇది వాణసవంశీయుఁడును, పద్మపురాణ కృతిపతియగు కందన మంత్రికి కృతి-

"ద్వి ॥ అని యిట్లు నిత్యధర్మారంభు పేర
జనలోక నవపారిజాతంబు పేర
చతురకళాపూర్ణ చంద్రుని పేర
అతులవైభవనిర్జరాధీశు పేర
శోభితనవరూపసూనాస్త్రు పేర
ఔబళమంత్రి కందామాత్యు పేర
.... .... ...
సింగనామాత్యుఁడు చెలువగ్గలింప
... ఆకల్ప ముగుభంగి చెప్పె."

ఇది నేఁటివఱకముద్రితము. తంజావూరి పుస్తకభాండాగారము సంఖ్య 307. కట్టా వరదరాజకృతి రామాయణద్విపద (సంఖ్య 351) క్రీ. శ. 1600[1].

ద్వి ॥ విలసిల్లె నన వేదవేద్యుని పేర
అలమేలుమంగాంగ నాధీశు పేర
అంచిత కరుణాకటాక్షుని పేర
కాంచనమణి మయాకల్పుని పేర
ఆదిత్యకోటి ప్రభాంకుని పేర
వేదవేదాంతార్థవినుతుని పేర

---

1 ఈ ద్విపద వాల్మీకిరామాయణము నాచే పరిష్కృతమై మద్రాసు రాష్ట్రీయ ప్రభుత్వమువారివలన తంజావూరి సరస్వతీ పుస్తక భాండాగారపక్షమున ప్రకటింపబడుచున్నది.

కంకణాంగగ రత్న కటకాఢ్యు పేర
వేంకటేశుని పేర విశ్వాత్ము పేర
...            ... వరదరాజు
రచియించు వాల్మీకి రామాయణంబు
విపులార్థ రచనల వెలిసిల్లుగాత.

మహాప్రసిద్ధుఁడు తంజావూరి రఘునాథరాయని నలచరిత్ర ద్విపద (ముద్రితము. 1921)                (క్రీ. శ. 1614-1633)

"అని జానకీహృదయానందు పేర
భానుమద్వంశ వైభవకరు పేర
నానాజగద్భవనస్థిరు పేర
పరమదయాది శోభనగుణంబులను
పరగెడు శ్రీరామభద్రుని పేర. .
...      ...      ...      ...
రఘునాథభూపాల ... సుఘటిత శబ్దపటిమఁ
దనరెడు నలచరిత్రంబు ... ...

19 వ శతాబ్దమువఱకు నీ సంప్రదాయమే కలదనుటకు క్రీ. శ. 1810 ప్రాంతములనున్న పోచిరాజువీరన కృతి విభూతిరుద్రాక్ష మాహాత్మ్యమునుండి గద్య నుదాహరించుచున్నాఁడను-

"ద్వి ॥ అనుదిన శివసపర్యాసక్తు పేర
అభియుక్తి వీరశైవాచారు పేర
శుభకరోద్యద్గుణ శోభితు పేర
విజయవాటీపుర విభుకృపాలబ్ధ
నిజమహాత్మ్యోదార్యనిర్ణయు పేర
పటుశమీశాఖానిబద్ధ వస్త్రాంత
ఘటితవైశ్వానరకల్పను పేర-"

అని ముగించినాఁడు.

పైని చూపినట్లు పాల్కురికి సోమనాథుని నుండి యధునాతన కాలమువఱకు ద్విపదలలో నీద్వితీయాంతములున్నను, నడిమి కాల

అని గగనలభస లను నాల్గిట గృతి
జను గజలఘు వి శ్రమము సుధుంగతి.

ఇది 4 మాత్రలు లేక లఘువులతో విఱుగుచు నడచునది. శ్రీపని, తాధిపు, జేరిథ, జంపు డు = (2 ల = 1 గ) 4×4 = 16 మాత్రలు గావున గజవిశ్రమము - నగా 8 వ అక్షరముపైని విశ్ర మము. దీనికి ఏకతాళము. ఇది చతురస్రగతిని నడచును. అనగా నాలుగక్షరములకు విఱుగును. ఏకతాళమునకు తాళాంగము 4 అక్ష రముల కాలము. అనగా సంగీత సంప్రదాయమున నొకలఘుకాలమున 2 అనుద్రుతములు + 2 ద్రుతములుండును. సంగీతము స్వరప్రధాన ముగావున, 4×4 = 16 అవి సాహిత్యమున వర్ణములు గావున 4 అక్ష రముల కాలమైనది.

6. హరిగతియనురగడ——

శ్రీరామాకుచకుంకుమ పంకము
చేఁబొలుపగు విపులోరః ఫలకము
తార తుషార పటీరసమానో
దకవాహిని యొదవిన పదకమలము
అతిశయమై యలవడునే దేవుని
ననవరతోదాంత నాహరిగతి
ఇతరులకలవడదని నృపలఘుయతి
నిభననలగ భభసలనగును హరిగతి.

ఇది మధురగతి రగడకు రెట్టింపుగావున - నృపయతి - 16 అక్షరముల పైని చెప్పఁబడినది. తాళము-ఏకతాళము.

7. వృషభగతిరగడ——

శ్రీమనోహరు నంబుజోదరు
చిత్తజాతగు రుందలంచెద
కామితార్థవిధాయి నిర్జిత
కాళియాహిని నాశ్రయించెద

నను వుగా భగణములు భానుస
మన్వితద్వితయములు నాలుగు
ననిమిషాధిపలఘుయుతి నిడగ
నలరు వృషభగమనము మేలగు.

ఇది మిశ్రజాతికిఁ జేరినది. అనగా రెండుమాత్రలకు లేక లఘువులకు విఱుగునది. శ్రీమనోహరు - నంబుజోదరు - చిత్తజాతగు - రుందలం చెద 7 × 4 = 28 కావున అనిమిషాధిపయుతి - అనగా 14 వ అక్షరముపై యతి - ఇది మిశ్రగతి - త్రిపుటతాళము.

8. హరిణగతి—

శ్రీనివాసుభజింతు నేనని
పూని కుజనుల పొంతఁబోవని
భానుయుతనల భనగగంబుల
లోన నిరుదోలును నగంబుల
నిరవుగా నిరుమూఁడులఘువుల
నెల్లవారును నొగి గణింపఁగ
విరతులను గావింప నిమ్ముల
హరిణగతి చెలువగు జగమ్మున.

ఇది వృషభగతిలో సగము—
శ్రీనివాసు భజింతు నేనని
పూని కుజనుల పొంత బోవని.

ఇందు 7 అక్షరముపైన 8 అక్షరము యతిపాటింపబడినది.

అనంతుఁడిచ్చిన రగడలక్షణములలో లఘువులపైని విశ్రమము చెప్పినాడు. ఇది ప్రాచీనసంప్రదాయపద్ధతి ననుసరించినది. తొలుత చతుర్మాత్రాపద్ధతిని మాత్రాచ్ఛందస్సులు ప్రస్తరింపబడినవి. ఆపైని అక్షరగణములలోని శ్రుతిసౌఖ్యము కొఱకు చతుర్మాత్రా పద్ధతిని విడిచి నలములను విడచి గగములను చేకొనిరి. అనంతుఁ డీరెండు మార్గములనుకూడ పైలక్షణములలోఁ జూపినాఁడు. ఇందలి

యతి సంగీతశాస్త్రమున చెప్పఁబడినదియే - సాహిత్యమున కెక్కినది. ఇది యొక్కటియే తెలుఁగు భాషకు, సంగీతసాహిత్యములకుగల యవి నాభావసంబంధమును తెలుపఁ జాలును. యతిస్థానమందు సాజాత్య వర్ణమున్న శ్రుతిహితముగనుండుట యీ కారణమువలననే యని యెన్నసగును.

రగడలు, నన్నయభట్టు భారతభాగముననూ, నన్నిచోడుఁడు కుమారసంభవమున నుపయోగింపకపోయిననూ, తరువాతికవులు వీనిని చంపూకావ్యములనఁదగిన ప్రబంధములలో వాడుక చేసిరి. రగడలు కన్నడమున క్రీ.శ. 840 ప్రాంతములకే వర్ధిల్లుచున్నట్లు కవిరాజ మార్గము తెలుపుచున్నది. క్రీ.శ. 940 లో పంపమహాకవి లలిత, మందానిలరగడల వాడియున్నాడు. క్రీ.శ. 990 ప్రాంతముల నాగ వర్మ ఛందోంబుధియందు లలిత, మందానిల, ఉత్సవ అను మూఁడు విధములగు రగడల నిచ్చియున్నాఁడు. వీనిలో మందానిలము తెలుఁగున మధురగతికి, లలిత ద్విరదగతికి, ఉత్సవ, తురగవల్గనరగడలకు సరిపోవును. తెలుఁగున ప్రథమచ్ఛందోగ్రంథమని చెప్పఁదగిన కవి జనాశ్రయమున నీరగడలక్షణములు లేవు. క్రీ.శ. 1402 ప్రాంతమున కావ్యాలంకార చూడామణిలో నలఁతిగను అనఁగా ఉత్సాహ ద్వితయ రగడగలదు. క్రీ.శ. 1435 లో అనంతుని ఛందస్సున సంపూర్ణ ముగను విపులముగను నీరగడలకు లక్షణము చెప్పఁబడినది. దాని ననుసరించియే తరువాతివారును లక్షణములను రచియించిరి.

సంస్కృతమున నీరగడ వృత్తము ప్రచారమున లేదు. ఇది దాక్షిణాత్య సంస్కృత కావ్యములయందు మాత్రము కన్పట్టు చున్నది. క్రీ.శ. 9 వ శతాబ్దినాటి సోమదేవసూరి 'యశస్తిలక' చంపువున రగడలు కలవు. అవి యొక రగడ వచనభేదముగా ముద్రిత మైనది. (చూ. యశస్తిలక చంపువు - నిర్ణయసాగర ముద్రాక్షర శాల 1916 పుటలు 15-16.)

" వికచకర్ణోత్పలస్పర్ధితరలేక్షణాః కేళితాళక్వణత్కనకమయ కంకణాః సరసనఖరాజివిస్ఫురిత భుజమండలాః కాంచికోల్లాసవశదర్శి

తోరుస్థలాః స్వైరసంజల్పనస్మేరబింబాధరాః కర్ణకండూమిషోద్వలిత కటాంతరాః పృథునితంబస్థలల్లటమాంగతి విక్రమాః సహజ శృంగార రసభరితముఖవిభ్రమాః."

పై వచనమును—

వికచకర్ణోత్పల స్పర్థి తరళేక్షణాః
కేళితాళీకృతాత్మానక మయూరాంకణాః
సరస నఖరాజివిస్ఫురిత భుజమండలాః
కాంచికోల్లాస వశదర్శితోరుస్థలాః
స్వైరసంజల్పనస్మేర బింబాధరాః
కర్ణకండూమిషోత్కలిత కటాంతరాః
పృథునితంబస్థలల్లట మాంగతివిక్రమాః
సహజశృంగారరసభరిత ముఖవిభ్రమాః

ఇది తెలుఁగున స్వైరదంగతిరగడతో సరిపోవుచున్నది. రెండేసి పాదములకు ప్రాసము పాటింపఁబడినది - మాత్రాగణప్రధానములగునవి యిట్టివి యశస్తిలకచంపువునఁగలవు. ఇవి దేశీయచ్ఛందోవిశేషములగుటచే కేవలసాంస్కృతికుఁడగు యశస్తిలకవ్యాఖ్యాతకు వీనివిశిష్టత గోచరించలేదు.

తెనుఁగున రగడలు ప్రత్యేకముగ వందలకొలఁది చరణములతోనుండును. తెలుఁగున చక్రపాణి రంగనాథుని "నయనగతిరగడ" లేక శివభక్తిదీపిక యంతయురగడయే - ఇట్లే సదాశివాయురగడ - కొన్నివందల చరణములు గలవి - ఈరెండును నేడు ప్రత్యేకముగ ముద్రితములైనవి.[1]

రగడలు నవీనప్రబంధములలో పుష్పాపచయము చేసినప్పుడు వర్ణితమగును - కాని ప్రాచీనకాలములో నవి దైవస్తుతిపరములు - శ్రీనాథుఁడు కాశీఖండమున మహాకర్తి కాప్రశంస రగడలో చేసి

1. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు - తిరుమల వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ సంచిక - 7 సం. 1 పుటలు. (17-40)

యున్నాఁడు - నాగులూటి శేషనాథుఁడు తన పర్వతపురాణమున రగడలు వ్రాసి యున్నాఁడు. ఇవి వాని ప్రబంధములలో పుష్పాపచయ వర్ణనమున నీరగడ నియమముగాఁ బ్రయుక్తమగుట ప్రాచీనకాలమున లేదు. పుష్పాపచయసమయమున నాడుచు, పాడుచు, యువతులుండురుగాన, నట్టిసందర్భమున గానయోగ్యములగు నీరగడల నుపయోగించిరని తోఁచుచున్నది.

రగడలు తొలుత శాసనములందు ప్రయుక్తములైనవి. కన్నడ దేశమున చాళుక్యశాసనములలో నివి గానవచ్చుచున్నవి. తెలుఁగు దేశమునను తొలుత నివి శాసనములయందు కానవైనట్లు రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనమునగుర్తించితిని. [1] ఇది సంస్కృతభాషామయమైనను, దేశిరచనయగుటచేత మనము ముఖ్యముగ పరిగణింపదగినది - ఇది కావ్యములలోతరువాత ప్రయుక్తమగుట చేతనే, దీనిని దేశిరచనక్రింద పరిగణింపవలెననియు, నవియేప్రత్యేకముగ నుపయుక్తములగుట చే, నుదాహరణరచనము కావ్యరచనకంటె ప్రాచీనమనియు స్పష్టమగుచున్నది.

కన్నడమున నంతకుముందు కావ్యములలో వెలసిన నన్నయ నన్నెచోడులిరువురును దానిని గ్రహింపక పోవుట యాశ్చర్యముగ నున్నది. ఒక భారతమువంటి పురాణమున నన్నయ కవకాశము లేక పోయినను, ప్రబంధవర్ణనలఁ బాటించిన నన్నెచోడుఁడు తన కుమారసంభవమున దీనిని గ్రహింపలేదు. ఆనాఁటికి తెలుఁగున నుత్తమ కావ్యరచనలోఁ జేర్పదగిన, కొన్ని రగడ భేదములైన యుండితీరును. కాని యానాటికవి యింకను గేయప్రధానములై యుండి యుదాహరణములకెక్కి, యుత్తమ కావ్యవాఙ్మయమున ప్రయుక్తము కాలేదని యూహింపనై యున్నది.

---

1. ఆంధ్రపత్రిక-ఉగాది-1950-51. పుటలు 128-146.

# ఉదాహరణ మూలములు

## (తెలుఁగు)

| ఉదాహరణము పేరు | కాలము క్రీ.శ. | కవి | పుట. |
|---|---|---|---|
| 1 బసవోదాహరణము | 1220 | పాల్కురికి సోమనాథుఁడు | 74 |
| 2 త్రిపురాంతకోదాహరణము | 1380 | రావిపాటి త్రిపురాంతకుఁడు | 82 |
| 3 ఉదాహరణ లక్షణము | 1403 | విన్నకోట పెద్దన | 97 |
| 4 ఉదాహరణభేదము | 1430 | శ్రీనాథుఁడు | 100 |
| 5 ఉదాహరణలక్షణము | 1435 | అనంతుఁడు | 102 |
| 6 ఉదాహరణలక్షణసూచనము | 1530 | చింతలపూఁడి యెల్లకవి (రాధామాధవకవి) | 103 |
| 7 వేంకటేశ్వరోదాహరణము | ... | తాళ్లపాక పెదతిరుమలయ్య | 105 |
| 8 హనుమోదాహరణము | 1540 | చిత్రకవి పెద్దన | 123 |
| 9 ఉదాహరణ సూచనము | . | బైచరాజు వేంకటనాథకవి | 136 |
| 10 ఉదాహరణ లక్షణము | 1550 | మూర్తికవి | 137 |
| 11 ఉదాహరణ సూచనము | ... | అయ్యలరాజు రామభద్రకవి | 138 |
| 12 హరిహరశ్లేషోదాహరణము | 1580 | చిత్రకవి అనంతకవి | 139 |
| 13 శ్రీకృష్ణోదాహరణము | 1656 | కాకునూరి అప్పకవి | 141 |
| 14 ఉదాహరణ రచనము | 1680 | గణపవరపు వేంకటకవి | 151 |
| 15 ఉదాహరణ సూచనము | 1700 | పోచన | 154 |
| 16 విశ్వేశ్వరోదాహరణము | 1720 | ఏనుఁగు లక్ష్మణకవి | ,, |
| 17 శేషార్యోదాహరణము | 1730 | బాలకవి అనంతయ్య | 157 |
| 18 ఉదాహరణరచనము | 1756 | పోడూరి పెదరామామాత్యుఁడు | 167 |

## ఉదాహరణ మూలములు (*contd.*)

### (తెలుగు)

| ఉదాహరణము పేరు | కాలము క్రీ.శ. | కవి | పుట. |
|---|---|---|---|
| 19 రఘునాథీయోదాహరణము | 1810 | సుదురుపాటి సాంబశివకవి | 168 |
| 20 ఆశ్వాసాంతవిభక్తులు | 1853 | వరవస్తు చిన్నయసూరి | 170 |
| 21 ముఖలింగేశ్వరోదాహరణము | 1896 | మచ్చ వేంకటకవి | 172 |
| 22 నాగేశ్వరోదాహరణము | 1937 | మండపాక పార్వతీశ్వరశాస్త్రి | — |
| 23 గోపాలోదాహరణము | 1940 | విశ్వనాథ సత్యనారాయణ | 173 |

పై యుదాహరణములలో (1) దైవపరములు :—

1. శివపరములు ... త్రిపురాంతక, విశ్వేశ్వర ముఖలింగేశ్వరోదాహరణములు
2. విష్ణుపరములు ... వేంకటేశ్వర, నామామ, శ్రీకృష్ణోదాహరణములు.
3. హరిహరనాథుఁడు. హరిహరశ్లేషోదాహరణము.

2. మానవపరములు :—

1. బసవ
2. శేషార్య
3. రఘునాథీయ
4. నాగేశ్వర
5. గోపాలోదాహరణములు

# ఉదాహరణ మూలములు

## (సంస్కృతము)

| ఉదాహరణము పేరు | కాలము క్రీ.శ. | కవి | పుట. |
|---|---|---|---|
| 1 బసవోదాహరణము | 1220 | పాల్కురికి సోమనాథుఁడు | 174 |
| 2 ఉదాహరణ లక్షణము | 1400 | గౌరన | 181 |
| 3 చిక్కదేవరాయోదాహరణము | 1710 | తిరుమలార్యుఁడు | 183 |
| 4 శివోదాహరణము | 1710 | ఓరుగంటి రామ కృష్ణామాత్యుఁడు | 191 |
| 5 ఉదాహరణ రచనము* | 1800 | సిద్ధరాముఁడు | — |

*ఈ యుదాహరణరచనము లభ్యము కాలేదు.

పైవానిలో దైవపరములు—శివపరములు :—

4. శివోదాహరణము.

5. సిద్ధరాముని యుదాహరణము.

మానవపరములు :—

బసవ, చిక్కదేవ రాయోదాహరణములు.

భోగావళి :—

చక్రవాళమంజరి, చతుర్భద్ర.

లక్షణలక్ష్యము లిందుగలవు.

# బసవోదాహరణము.

పాలకుఱికి సోమనాథమహాకవి రచితము.

—: కవిజీవితము - గ్రంథవిషయము :—

[ఆంధ్రదేశ శైవవాఙ్మయమునకే గాక, కన్నడదేశ శైవవాఙ్మయమునకు మూల పురుషుడని చెప్పదగిన పాల్కుఱికి సోమనాథుడు క్రీ.శ. 1190-నుండి 1260 వఱకు వెలసిన వాడు. ఈతని చరిత్రము సమగ్రముగ నా తెలుగు కవి చరిత్ర 3వ భాగములో చూడనగును.

ఈ యుదాహరణమున కన్నడదేశమున వీరశైవమును ప్రతిపాదించిన బసవేశ్వరుని మహిమ వర్ణితమైనది - సోమనాథుడు తన బసవపురాణమునను, వృషాధిపశతకమునను, గద్యలయందును పేర్కొనిన విషయములే యిందును పేర్కొనినాడు. ఈ యుదాహరణశాఖకు, సంస్కృతాంధ్రములందు నితడే మూలపురుషుడు.]

ఉ॥ శ్రీగురులింగ తత్పరుడ - శేషజగన్నిధి శుద్ధతత్త్వసం
యోగసుఖప్రపూర్తి, వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి, ది
వ్యాగమమార్గవర్తి, బస - వయ్య కృపాంబుధి మాకు దివ్యసం
భోగములం బ్రసాదసుఖ - భోగములం గరుణించు గావుతన్.

కళిక

వెండియు ద్రిభువన - వినుతి సమేతుడు
మండిత సద్గుణ - మహిమోపేతుడు
సురుచిర శివపద - సుఖసంధానుడు
పరమపరాపర - భరితజ్ఞానుడు
విదితానందా - న్వితమానసుడు
సదమల విపుల వి - శాలయశస్కుడు
శ్రీవిలసిత పద - చిరశుభ భద్రుడు
1 గావున సాక్షాత్ - కలియుగరుద్రుడు

ఉత్కళిక

భువనోపకారి 2
భవమోహదూర

1. గావుత 2 కారా అన్ని పాదములు చివర వ్రాతలో దీర్ఘములు - వీరా, యోగా, భోగా.

భక్తిసంయోగ
ముక్తిసంభోగ
సౌఖ్యాబ్ధిలోన
ముఖ్యుఁడై తాన
వెలయు శుభకరుఁడు
[1] ఇల విశ్వగురుఁడు.

## ద్వితీయా విభక్తి

చ॥ పసిగొని యొప్పుఁ డేని బస - పాయను నీసుకృతాక్షరత్రయం
బెసగఁ బఠించె నేని గిరి - జేశుని కాతనివక్త్ర గహ్వరం
బసదృశ గేహమన్న [2] యవి - యార్యుల వాక్యము [3] లట్లుకావునన్
బసవనఁ బుణ్యమూర్తిఁ దలఁ - పంగదె చిత్తమ! పాయకెప్పుడున్

## ద్వితీయావిభక్తి కళిక

వెండియును భక్తాభి - వృద్ధిఁ బెంచినవాని
[4] బండమాయావాద - పథముఁ ద్రుంచినవాని
నద్వైతవాక్యసం - హారుఁడై చనువాని
విద్వత్తముం గెల్చి - వీరుఁడై మనువాని
మీమాంసకులముక్కు - మిగులఁ గోసినవాని
తామసధ్వాంతంబు - తగులు బాసినవాని
పెక్కు దైవంబులను - పేరుమాపినవాని
నొక్కఁడే రుద్రుఁడని - యుక్తిఁ జూపినవాని

## ఉత్కళిక

ప్రకృతివాదముఁ దుడిచి
వికృతివేషము లుడిచి
సకలవాదుల నోర్చి
సుకృతమార్గముఁ దీర్చి
భూమిభారము మాన్చి
గామించుగతిఁ జూప

---

1. నలివిశ్వ 2. యది 3. నట్లు. 4. చండమాయా ధారసరణి-ముద్రితము 1944.

నెమ్మిఁ జాలినవాని
మమ్ము నేలినవాని

## తృతీయావిభక్తి

ఉ॥ జంగమపాత్రుచే, సమయ - సన్నుతుచే, భవరోగవైద్యుచే
మంగళమూర్తిచే, గరళ - మర్దనుచే, ననమానశౌర్యుచే
లింగకుమారుచే, బసవ - లింగముచే, బసవయ్యచే. కృపా
సంగతుచేఁ బ్రసాదసుఖ - సౌఖ్యమునొందెద భక్తిఁ జెందెదన్.

కలిక

వెండియును వేదోక్త - విలసచ్చరిత్రుచే
దండిభవబంధసల - తాచయ లవిత్రుచే
విధినిషేధాతీత - వినుతైకగణ్యుచే
బుధజనప్రోద్గీత - భువనాగ్రగణ్యుచే
ప్రవిమలశివాచార - భవ్యప్రసారిచే
భవిజనపరి[1]త్యాగి - భక్తి [2]బండారిచే
శివచిన్మయాపరి - చ్ఛిన్నప్రమోదిచే
పరమార్థతత్త్వాను - భవసుఖాస్వాదిచే.

### తృతీయావిభక్తి - ఉత్కళిక

సన్నుతులగరిగట్టి
మన్ననల తుదముట్టి
ప్రమథకవిలియ కెక్కి
విమలసంపద నిక్కి
శివలీలఁ బెంపార
భువి బసవఁడను పేర
మెఱయు సువిధజ్ఞుచే
నెఱయుఁ దత్త్వజ్ఞుచే

1. త్యాగ. 2. భండారిచే.

## చతుర్థీ విభక్తి

చ॥ అతని ప్రసాదసౌఖ్యమున - కంగము, కీర్తికిఁ గర్ణముల్, గుణ
స్తుతులకు జిహ్వయుం జరణ - తోయజసంగతికి న్నమనంబు స
మ్మతగుణదివ్యమూర్తికిన - మస్కృతియుక్ విధియించి కూడన
ట్లతులితపుణ్యుఁడైన బస - వయ్యకునై ప్రణమిల్లు చిత్తమా!

### కళిక

వెండియును నిర్మల ప - విత్రగోత్రునకునై
పండిత[1] స్తవనీయ - పాత్ర గాత్రునకునై
దురితభంజనకళా - ధుర్యచరితునకునై
సరవి నిష్టవ్రతా - శ్చర్య భరితునకునై
సవిశేషవిమలగుణ - జాలలోలునకునై
శివయోగ సంధాన - శీలపాలునకునై
2. ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ...

### ఉత్కళిక

లింగచిహ్నాలు మోచి
దొంగలుండఁగఁ జూచి
కొంగులను బొదిగొన్న
వంగ కాయలు మున్న
లింగములుఁగాఁ జెల్పి
జంగమేచ్ఛలు సల్పి
భవరోగ హారునకై
శివరూపధరునకై.

---

1. స్తవనైక.

2. ఈ రెండు పాదములును శ్రీబండారుతమ్మయ్యగారిచే నిట్లు పూరింపఁబడినవి.

"భక్తిసీమంతినీ ప్రాణనాథునకునై
భక్తగణసేవనవ్రతసనాథునకునై" —1944. ముద్రణము.

షష్ఠీవిభక్తి

ఉ॥ దుస్తరకర్మభూసురులు - దూషకులై కులమెత్తిపల్కుచున్
నాస్తికులౌచుఁ జూడ శివ - నాగయగారిగుఱించి వారి శ్రీ
హస్తతలంబునందు విషు - లామృతధారలు వెల్లిగుర్యనా
ర్యస్తుతిఁ [1] బేర్చు నబ్బసవ - రాజునకే నతిభక్తిసేయుదున్

షష్ఠీవిభక్తి - కళిక

వెలసియు నోంకారసార - విదితముదిత మేళనునకు
పండినిండి పొలుపు సలుపు - భక్తియుక్తి పాలనునకు
భవ్యసేవ్యశోభిత చరణ - పద్మసద్మఖేలనునకు
నవ్యదివ్యలలితకలిత - నాద భేద[2]లోలనునకు
యమనియమ నిరంతరాంత - రాంగసాంగవర్తనునకు
నమిత శమిత విషమ విషయ - హారి భూరి కీర్తనునకు
సత్యనిత్యభోగయోగ - జాగ్రత తంత్రదూరగునకు
సత్యనిత్య శుద్ధ బుద్ధ - సత్త్వ తత్త్వపారగునకు

ఉత్కళిక

మహిఁ బురాతనోక్త భక్తి
మహిత తత్త్వ శక్తి యుక్తి
మహిమఁ గొనగ లింగజంగ
మమున్ ప్రాణలింగమునకు
సమ్మతముగ భువిని వెలసి
ప్రమథలీలసొలసి యొలసి
యున్న గణవిరాజితునకుఁ
[3] జన్నబసవపూజితునకు

సప్తమీవిభక్తి

చ॥ అసమగుణాఢ్యునందు, శర - ణాగతవత్సలునందు, జంగమ
వ్యసనమహిష్ఠునందు. భవ - వారణ కారణమందు, భక్తమా

1. నించు. 2. లాలనునకు. 3. చెన్నబసవ.

ననపరిపూర్ణునందు, గణ - నాథునియందు దయాపయోధియౌ
బసవనియందు మాబసవ - పాత్రునియందు వసింపు చిత్తమా!

కలిక

వెండియు[1] ... ... ...నందు
చండమదన - శౌర్యునందు
దురిత భయావి - దూరునందు
సరసభక్తి - సారునందు
సుకరశరణ - సూత్రునందు
సకలవిషయ - జైత్రునందు
భువనసత్త్వ - బుద్ధునందు
శివగణాగ్ర - సిద్ధునందు

సప్తమివిభక్తి - ఉత్కలిక

శరణజనుల
వరువుబనుల
తనువుతగవు
ధనముమనము
నమసిసంగ
తముగలింగ
నిజమునందు
విజయునందు

సంబోధన

చ॥ ఎసగ లలాటవహ్నిఁగుసు - మేషుదహించినకాలరుద్ర! మున్
గసిమసఁజేసి దక్షునిమ - ఖంబు హరించిన వీరభద్ర! యి
వ్వసుమతిఁబుట్టి భక్తజన - వశ్యుఁడవైనకృపాసముద్ర! యో
బసవ! భవత్ప్రసాదసుఖ - భాజనుఁజేయవె నన్నునర్మిలిన్.

---

1. శివవీర్య - ముద్రితము.

క ళి క

వెండియును సమస్తలోక - విదితవిమలభక్తిబీజ!
దండితేంద్రియప్రచండ - పరశివసుగుణసమాజ!
జంగమప్రసాదభోగ - సారసౌఖ్యశరధిమగ్న!
లింగసంగతానుభావ - లీలశరధి [1]సంవిలగ్న!
అతులసకలభువనపావ - నానితారపుణ్యమూర్తి!
సతతపవిత్ర విశ్రుతత్వ - సారసౌఖ్యఘనమహాత్మార్తి!
భవభయప్రసారమార - భక్తసులభసుకృతకాయ!
దివిజబృందవందితాద్వి - తీయ శంభునామధేయ!

ఉ త్క ళి క

పరమగురుసమాతానుకూల
చరితసుగణప్రసంగలోల
లింగపూజనావిధేయ
జంగమార్చ[2]నానపాయ
శ్రీస్వపేంద్ర దివ్యమూర్తి
శైవసమయ సత్ప్రవర్తి
భక్తిసత్క్రియాధురీణ
భక్తసక్తిప్రవీణ!

సా ర్వ వి భ క్తి క ము.

ఉ॥ నీవు దయారసమోనిధివి - నిన్ను నుతించినఁగల్గు భక్తి నీ
కు వరగిరశైవరతి - చేకుఱు, నీకయి యిత్తు గబ్బముల్
నిచలనం గృతార్థత జనించును, నీకు నమస్కరింతు నా
భావమునందు నుంచి నను - బాయకుమీ బసవయ్య! వేడెదన్.

వి వ ర ణ ము

నీవు దయారసమోనిధివి — ప్రథమావిభక్తి
నిన్ను నుతించినఁగల్గు భక్తి — ద్వితీయా ,,

1. సోవిలగ్న. 2. కానపాయ

| | |
|---|---|
| నీచే వరశీఘ్రశైవసిద్ధి చేకురు | తృతీయా విభక్తి |
| నీకయి యుత్తుంగగర్వముల్ | చతుర్థీ ,, |
| నీవలనం గృతార్థత జనించును | పంచమీ ,, |
| నీకు నమస్కరింతు | షష్ఠీ ,, |
| నీభావమునందు నుండి నను గాయుమీ | సప్తమీ ,, |
| బసవయ్య! వేఁడెదన్ | సంబోధన ,, |

గ్రంథసూచిక :—

1. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము - చెన్నపురి. తాళపత్రప్రతి సంఖ్య. డి. 2765

2 భారతి-సం. 5. సంచిక 2. (ఫిబ్రవరు 1928) పుటలు-299-303. బ్రహ్మశ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బ్రకటితము.

3. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సం. 34. సంచిక 1-2 (చైత్ర-ఆషాఢముల) 9-17 పుటలు -పార్థివ-
శ్రీ బండారు తమ్మయ్యగారిచేఁ బ్రకటితము.

---

# త్రిపురాంతకోదాహరణము

## కవి జీవితము

[రావిపాటి త్రిపురాంతకుని వాడుక పేరు తిప్పన.[1] తెలుఁగుకవులలో నీతని చరిత్రము బహుసులభముగా వ్రాయవచ్చును. ఏలయన నితని పేరుతప్ప తలిదండ్రుల పేళ్లుగాని, కులగోత్రవిద్యావిషయము లితరములేవియుఁ దెలియరావు. త్రిపురాంతకుని నితరకృతులు సంపూర్ణముగా దొరకినచోఁ గొంత తెలియును గాని వానియందు కొన్నిపద్యములే లభించుచున్నవి గావున నీతని చరిత్రము నిగూఢమైయున్నది.

జన్మముచే నెవ్వఁడైనను భక్తిప్రపత్తి గుండితఁడు శైవుఁ డని చెప్పనొప్పును. ఈ యుదాహరణమునందలి శైవసంప్రదాయాభిజ్ఞతయుం గాక ప్రాచీనశివభక్తకథాసూచనమునం దేమి కవి శైవుఁ డగుట స్పష్టమే! పేరు శైవులదే! ఈతఁడు శ్రీశైలమునకుఁ దూర్పువాకిలియగు త్రిపురాంతకక్షేత్రమున జనించి తద్దేవునకు భక్తుఁడై శృంగారకావ్యములను భక్తిరసప్రధానములగు కావ్యములు రచియించె

---

1. భాస్కరశబ్దమునకు బాచన్న, తిరుమలశబ్దమునకుఁ దిమ్మన, త్రిపురాంతకునికి తిప్పన, జగన్నాథశబ్దమునకు జగ్గన్న, ఆదిత్యునకు నైతన, భైరవునకు బయ్యన్న వికృతిరూపములు.

నని రెండవప్రతాపరుద్రుని కాలములోనివాఁడని శ్రీరామకృష్ణకవిగారు త్రిపురాంతకోదాహరణము తొలికూర్పునను, మలికూర్పునగూడ వ్రాసియున్నారు. దీని కాధారమాహ్యము.

## కాలనిర్ణయము

శ్రీరామకృష్ణకవిగారు, త్రిపురాంతకుఁడు ద్వితీయప్రతాపరుద్రుని కాలము వాఁడని వ్రాసినారు. త్రిపురాంతకుఁడనుకవి ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానము ననున్నట్లు ప్రతాపచరిత్రమున [1] గలదు. కాకతీయచక్రవర్తులలోఁ గడపటివాఁడగు నీప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1295 మొదలు 1326 వఱకు బరిపాలించినవాఁడు. కావున నీతఁడా కాలమువాఁడు కావలెను. కాని దీనికొక ప్రతిబంధకము గలదు. రావిపాటి తిప్పన్నగారు ధారయను యప్పకవీయమున యతిప్రాస విషయికమగు మూడవ యాశ్వాసమున ననుస్వారిబంధయతి కుదాహరణముగా నీక్రిందిపద్య ముదాహరింపబడియున్నది.

మ॥ సరివేఁడ్తు రిపుడేలభాస్కరులు భాషానాథ! పుత్రా! వసుం
ధరయుం దొక్కఁడు మంత్రి యయ్యె వినుకొండన్ ; రామయామాత్యభా
స్కరుఁడో? కాఁ, నయిననన్నహస్రకరశాఖల్లేవ వేయున్నవే
తిరమై దానముసేయుచో, రిపులహేతిన్వేయుచో వ్రాయుచోన్.

పై పద్యమునందలి పాఠము ముప్పదియిద్దఱు మంత్రుల చరిత్రమున రాయనామాత్య భాస్కరుఁడని యున్నది. ఇదియ సరియగు పాఠము. ఈ భాస్కరులు పెక్కఱు గలరు. వారిలో నీరాయని భాస్కరుఁడు దాతృత్వమున తెలుఁగు నాఁటఁ బేరెన్నికఁ గన్నవాఁడు. ఈతనిఁ గూర్చి భట్రాజులు చెప్పినపద్యములు చాలకలవు. గ్రంథవిస్తరభీతి నుదాహరింపమానితిని. ఈతఁడు క్రీ. శ. 1386 సం॥ ప్రాంతమున రాజమహేంద్రవరమును పరిపాలించిన రెడ్డిరాజు కాటయవేముని యాస్థానముననున్నట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

చ॥ కలయఁ బసిండిగంటమునఁ గాటయవేమసమక్షమందు స
త్ప్రలముగ రాయనిప్రభుని భాచఁడు వ్రాసినవ్రాలప్రోఁతలున్
గలుగలు గల్లుగల్లురనఁ గంటకమంత్రుల గుండెలన్నియున్
జలుజలు జల్లుజల్లురనె సత్కవివర్యులు మేలుమేలనన్.

రాయనిభాస్కరుని స్తుతియించిన త్రిపురాంతకుఁడు క్రీ. శ. 1380 ప్రాంతమువాఁడు గావలెను.

ఇందులకు ప్రబలముగ శ్రీనాథకవిరచితమై వల్లభరాయనికృతిగా పేర్వెలసినక్రీడాభిరామమున త్రిపురాంతకుని ప్రశంసగలదు.

---

1. ప్రతాపచరిత్రము. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక. సం. 7. పుట. 7.

ఉ॥ నన్నయభట్టు, తిక్కకవినాయకుఁ డన్న, హుళక్కిభాస్కరుం
డన్ననుఁ, జిమ్మపూడియమరేశ్వరుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గిరాంజలులు నింతురు 'జే' యని రావిపాటితి
ప్పన్నయు నంతవాఁడె! తగునా యిటువోసపుమాట లాడఁగన్.

మఱియు నీ త్రిపురాంతకుఁడు సంస్కృతమున రచియించిన ప్రేమాభిరామము ననుసరించి తెనుఁగున క్రీడాభిరామము రచియించినట్లు గ్రంథమునఁ గలదు.

“ తిప్పమంత్రీంద్ర నయముఁ గార్యమణి [illegible] తుల్యుఁడవారసాంబ ”

వ. ఆమంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతక దేవుఁడను కవీశ్వరుఁడొనరించిన ప్రేమాభిరామ నాటకము ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెలుఁగుబాసను రచియించినాఁడు.”

వల్లభరాయని తండ్రి తిప్పన్న కర్ణాటక రాజ్యమును పరిపాలించిన మొదటి హరిహరరాయని రత్నభాండాగారాధికారి యగుటచేతను, నాతని పెదతండ్రి లింగన రెండవ హరిహరరాయల సేనాధిపతి యగుటచేతను, వీరిరువురు 1404, 1412, సం॥ ప్రాంతమున నున్నవారు.

ఆంధ్రదేశమున భాస్కరుల చరిత్రమునుఁ దెలిసికొనఁగోరువారీ క్రింది గ్రంథముల చూడవగును.

(1) ముప్పది యిద్దఱు మంత్రుల చరిత్రము (1889).
(2) భాస్కరోదంతము. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి (1898).
(3) రాయని భాస్కరమంత్రి చరిత్రము. గురుజాడ శ్రీరామమూర్తి (1900).
(4) కొండవీటి సామ్రాజ్యము. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు (1915).
(5) చాటుపద్య మణిమంజరి. ప్రథమభాగము వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1924 పుట 78-85.

వల్లభరాయఁడును శ్రీనాథుఁడును సమకాలికులు (క్రీడాభిరామము పీఠిక 10 పుట.) కావున. క్రీ. శ. 1404-12 ప్రాంతముననున్న వల్లభరాయఁడు స్తుతించిన కవి త్రిపురాంతకుఁడు క్రీ. శ. 1380 ప్రాంతమువాడనుట సమంజసము.

శ్రీరామకృష్ణకవిగారూహించినట్లు త్రిపురాంతకుఁడు ద్వితీయప్రతాపరుద్రుని కాలమునఁ బెద్దవాఁడు కాకున్నను నాకాలముననె యనఁగా క్రీ. శ. 1320 ప్రాంతమున జన్మించి యుండవచ్చును. మఱికొందఱు విద్వాంసులు త్రిపురాంతకుఁడు ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానవిద్వాంసుఁడని వ్రాసియున్నారు. [1] దీనికి

---

1. Sources of Vizianagar History 17. Kridabhiramam of Vinukonda Vallabharaya. "This is a translation into Telugu of the Sanskrit Premabhiramam a drama belonging to the class called Vidhi in Sanskrit Dramaturgy of the poet Ravipati Tripurantaka of the court of Prataprudra II of Warrangal. Page 55 (1919) published by Madras University)

పైకవిగారి వ్రాతయే యాధారమై యుండనోపును. కవి ౧౪ వ శతాబ్ది వాఁడని నిశ్చితము.

## కవికృత యితర గ్రంథములు

త్రిపురాంతక కవికృతులీ క్రిందివి మనకుఁ దెలియుచున్నవి.

(1) త్రిపురాంతకోదాహరణము. (2) అంబికాశతకము. (3) చంద్రతారావళి. (4) మదనవిజయము.

సంస్కృతమున ప్రేమాభిరామము.

త్రిపురాంతకోదాహరణముగూర్చి ముందు తెలుపఁబడును.

### 2. అంబికాశతకము

ఇందేడుపద్యములుమాత్రము లభించినవి. వాని నిటఁ బొందుపఱచెదను. శతకమున కంబికా యను మకుటము.

ఉ॥ ఆదిమశక్తి యాతరుణి యాద్యకుటుంబిని యాకుమారి, ము
త్తైదువ యాతలోదరి, చిదాత్మక యాసతి విశ్వమాత యా
పైదలి సర్వలోకగురుభామిని యాచపలాక్షి యనుచు బ్ర
హ్మాదులు వచ్చినిచ్చలు హిమాద్రికి నిన్నుతియింతు రంబికా!

ఉ॥ [illegible] ద్రిజకలో [illegible] గనాఁడుకెక్కి బ్రోవఁగ, [illegible]ద్దు పెపట్ల
జాడలు [illegible] ప్ర[illegible]న్నలకెచన్ద్రులు మించుచోలంగ; స్వర్ణనన్
జాడఁగ [illegible] మెఱుఁగుజాపులు నీన హిమాద్రియింట నీ
వాడుట కాలికిన్ మనము వాడుట గాదె తలంప నంబికా!

ఉ॥ భారతివై సరోజభవు చాల వసించి, రమావధూటివై
నీరజనాభుఁ జెంది, ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించితమ్మ నినుఁ గొల్చిన యారక యేలకల్గు సం
సారసుఖంబు లీమనుజసంతతి కిందఱపోయి నంబికా!

—(ప్రబంధరత్నావళి. పుట 53).

చ॥ ఔడఁగను [illegible]క్ష్నదర్పణమునుఁ జేసిన వెన్నెల వోసినిచ్చలున్
దుడుమఁగ, పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుఁ [illegible]నికందువో
గ్రహించఁగ, నేరెచేటసితకంజము లుంపఁగ, నైజకాంతితోఁ
బొడరినతల్లి నీ మొగముతో సరిపోల్పఁగ జాలు నంబికా!

ఉ॥ అప్పలఁబోరుఁ డబ్బులిసతీమణులు నా తొడుచూపు గుంచియున్
త్రిప్పి తళుక్కునం దెఱచి తిన్నని మోమునఁ గాయు వెన్నెలల్
ముప్పిరిగొన్న కేడంబులు మూఁగిన సిగ్గు సయాడఁ బ్రీతినీ
వప్పరమేశుఁ జూచి కనువర్గము గొంటపోసంగ నంబికా !

(ప్రయోగతత్త్వార్థానందము వ్యాఖ్యానము)

ఉ॥ వ్రాలిసరకన్నె మంగురులు వాతెఱకెంపుమెఱుంగు జంటిపై
గ్రాలెడుతారహారములు కంకణరావకరంబు నాపలన్
దూలుమనస్సు పయ్యెదయుఁ గోచికన్నలు నోడ్చి మోహితా
పాలగునీశు మేనసగపాలు మనంబునఁ జేర్చు నంబికా !

ఉ॥ లాంచిపరాంగనల్ వలవిలాసమనోహర విభ్రమంబులన్
చూచినఁ జూడఁడు త్రియంబకు చూపించుఁ జూడమని యుద్ధ్రతియుండు నా
జూచినచూడకుండి నను జూచు కనిష్ఠుఁడు నన్న పిలిలో
చూచినచూడకుండు గుణిఁజూచి మాఘున చూడుమంబికా !

(తొలిపూర్వనుండి)

ఈ శతకమునుఁ గూర్చి శ్రీ రామకృష్ణకవిగారి యభిప్రాయము నిటఁ బొందుపఱచుట యుక్తము.

“ అంబికాశతకమునఁ బార్వతీనాయికాగుణవర్ణనలు రసజ్ఞులకింపుగా మృదుభావతోఁ గూర్పఁబడినవి. నేఁటికాలమున శృంగార రస సముద్రమునఁ విధురులు కొందఱును, భక్తిరస నియమప్రణాళికాపారీణులు కొందఱును ఉత్తమదేవతావర్ణనముల శృంగారరసభావముల రసాభాసములుగఁ దలచుచున్నారు. దీనిలో నుత్తమదేవతలైనను నంబికాశివుల పరస్పరశృంగార రసోన్నతి వర్ణింపబడినది. కాని ధ్వనికారుల మతమున రసాభాసమనునది యెచటను గానరాదు.”

## ప్రేమాభిరామము

ఇత్యాది సంస్కృతమున వీథిరూపకముగా రచియింపబడినది. క్రీడాభిరామము దీనియాంధ్రానువాదమని తెలిపితిని. ప్రేమాభిరామము సంపూర్ణముగా లభించినగాని గ్రంథపరిశీలనకుఁ గుదురుఁగలుగదు. ప్రేమాభిరామము పెదకోమటి వేముని “సాహిత్యచింతామణి” యనునలంకార గ్రంథమున నుదాహరింపఁబడినది. సాహిత్యచింతామణి ముద్రితమే - అందుండి.

పరారి సందర్శితసన్నివేశా
పరుత్సరాభూత పయోజకోశా ।
ఇహైవ మస్తాళ ఫలోపమానా
స్తనా కిమన్యా పురతో భవేతామ్ ॥

అనుశ్లోకము సాహిత్యచింతామణియందుదాహృతము. దీని తెలుఁగుపద్యము.

"దారమైయునందు చుట్టుకొని గోరణకట్టై సుతోవిభాగమున్
నిరుపు పయోజకోశరమణీయముకిఁ జూప్పిన వస్త్రమూసవ
త్సరమైన నొప్పెహేమకలశంబులవాగున ముదమేటికిన్
గరినిభయానచన్నుఁగవ కౌఁగిలిపట్టులుగాక యుండునే."

—క్రీడాభిరామము (పుట 86).

మఱియు ప్రేమాభిరామము వృత్తరత్నాకర వ్యాఖ్యానమం దుద్ధరింపఁబడినది.

లశునం సర్షపశాకం
సవౌదనం పిచ్ఛిలాని చ దధీని ।
స్వల్పవ్యయేన సుందరి
గ్రామ్యజనో మృష్టమశ్నాతి ॥

దీని తెనుఁగు పద్యము.

"శీతకాలంబు గిడిమాడ నేయుఁగుడుము
భాగ్యవంతుండు ఓపాడిపల్లెపట్లు
గొఱ్ఱెయొరెంబు నిగురావఁగూరతోడఁ
పిచ్చిలంబైన నేతితోఁ బెరుగుతోడ."

—క్రీడాభిరామము. (87. పుట).

## 3. చంద్రతారావళి

ఇందిరువదేడు పద్యములలో నాలుగుమాత్రమే లభించినవి.

మ॥ పరమజ్యోత్స్నాధర చారుసింహముఖ దంష్ట్రాకోటి యానాఁగ నం
బరశార్దూలనఖంబు నాఁగఁ దినురే ఖప్రస్ఫురద్గర్వసం
హరణప్రహారత రాంగశంబనఁగ నుద్యల్లీల మీరేఖని
త్యరుచిం బోల్పఁగ బెంపుఁగున్విదియ చంద్రా! రోహిణీవల్లభా!

మ॥ అమితధ్వాంతతమాలవల్లిలవన వ్యాపారసారీణదా
త్రమొ, సౌగంధికషండ కుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమచర్యాణధురీణకుంచికయొ, నాఁగం బెంపునన్నీకళా
రమణీయత్వముఁ జూడ నొప్పెసఁగు చంద్రా! రోహిణీవల్లభా!

శా॥ రతినాథుండను మాయజోగి చదలం దైత్రిలోక్యవశ్యాంజనం
బఱియన్నెమ్మెయిఁ గూర్చి మౌక్తికమయంబై యున్న పాత్రంబునన్
సొగకం జేర్పడఁ బెట్టి దాచెనన మీ మధ్యంబునన్ మచ్చ సం
తతముం గన్నులపండువై వెలయు చంద్రా! రోహిణీవల్లభా!

మ॥ పాలకయ్యంబులఁ గల్గుముద్దుటలుకన్ బుష్పాయుధారాతి క్రొం
త్కాలఁ దీర్పన్ దల మీద గానవగు నీ క్రొమ్మేను పుణ్యాంగనా

శైలజాముఖ చంద్రరోచుల - చవులఁదవిలెడు నవచకోరము
వేలుపుందపసుల తలంపుల - వెల్లిగొల్చెడు నమృతపూరము
దేవతలు మువ్వురకు నవ్వలి - దెస వెలుంగుచు నుండు నెక్కటి
భావవీథులఁ గలసి పలుకులఁ - బట్టి చెప్పఁగరాని చక్కటి
ఆఱురేకుల మంత్రకుసుమము - నందు నెలఁగెడి చంచరీకము
వేఱు సేయక యోగిజనములు - వెదకి పొందెడు, నూర్ధ్వలోకము

ఉత్కళిక

అడుగఁ దమ్ములఁ జొప్పానసిగిని
యడరి శునకాకృతులు గైకొని
మీఱి చదువులుదవుల ముందట
బాఱు క్రోడము నేసి మందట
లాడి తనుమార్కొనఁగ వచ్చిన
క్రీడికోరిన వరము లిచ్చిన
యాటవికకులపర్వభావుఁడు
జూటభాస్వత్తుహినధాముఁడు

ద్వితీయావిభక్తి

ఉ॥ హామును హారమున్, నెలయుఁ - బాపట సేసయు, నేఱుమల్లికా
దామము, తోలుదువ్వలువ - దట్టపుభూతియు చందనంబుమై
సామునఁజాలనందముగ - సన్నిధి సేసిన చూడగంటి నే
నామదిలోఁ గుమారగిరి - నాథుని శైలసుతాసనాథునిన్

కళిక - విజయభద్రరగడ - జంపెతాళము.

మఱియు వేలుపులేటి - మాళినాఁగినవాని
నెఱియఁ గన్నపనోటి - నీటఁదోఁగినవానిఁ
బొలఁతితో నొక్కొడలఁ - బొత్తుఁగూడినవానిఁ
దలఁకి సేనవరాజు - దాడి కోడినవాని
శాఖ్యతొండని గాల - జడికి నోర్చినవాని
సౌఖ్యతరసాయుజ్య - సరణిఁ గూర్చినవాని

వెన్నెలలఁ బురుణించు - వెలఁదినవ్వులవాని
వెన్నునకు నలువకును - వెదుక దవ్వులవాని

## ద్వితీయావిభక్తి - ఉత్కళిక

చిగురుఁగైదువు వెఱికి
మగల సిగ్గులు నఱికి
సతులఁబాటులు పఱిచి
యతులవ్రతములు చెఱిచి
అలులు చిలుకలు పిండు
లెలయఁగొలువఁగ నుండు
మరు జయించినవానిఁ
గరుణమించిన వాని

## తృతీయావిభక్తి

ఉ॥ వాలినటించుముక్తివర - వర్ణినిపయ్యెదకొంగు చాడ్పునన్
గ్రాలు నిజాంకవుంబడఁగ - కన్నులఁ జూచినఁజాలు, నిమ్నగా
స్ఖాలితమాళిచేత, పుర-భంజనుచేత, కుమారపర్వతం
బేలెడు రాజుచేత ఫలి - యించు జనావళి కోరుకోరుకుల్.

కళిక - హయప్రచారము లేక తురగవల్గనము - రూపకతాళము.

మఱియు మత్తిగ్రామానిమొదల - మరగి యున్న గురునిచేతఁ
గొఱలి తాపసులకు నెఱుకఁ - గొలుపు జటిలవరునిచేత
నంబివనుప కుంటెనలకు - నడచిన యొడకానిచేత
నంబరాదితత్త్వములకు - నవలయైన ఱేనిచేత
బల్లహుని వధూటికాస - పడిన దుండగీనిచేత
నల్లయలకనేలురాజు - ననుఁగు సంగడీనిచేత
భూతిపూయుమానవులకుఁ - బుట్టుమాన్పువైద్యుచేత
ప్రీతి ధాతవునుకకోర - భిక్షసేయునాద్యుచేత

## ఉత్కళిక

ఇలరథంబు లీలనొప్ప
నలువ నిగమహారులరొప్పఁ
బొసగఁ బాఁప నారిఁబట్టి
పసిఁడి కొండ యెక్కువెట్టి
జడధినిద్రప్రోవు శరముఁ
దొడఁగి నేలఁగూలఁ బురము
లేసియున్న జోదుచేత
దాసవర కణాటుచేత

## చతుర్థీ విభక్తి

ఉ॥ ఆఱడియాస నీరసధ - రాధిపలోకము లిండ్లువాకిళుల్
దూఱుటమాని శ్రీనగము - తూఱుపువాకిలిఁజొచ్చి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతి - నీటనుఁ గ్రుంగి మనంబులోని చి
చ్చాఱఁగఁ జేయుటొప్పు త్రిపు-రాంతక దేవునకై నమస్కృతుల్

కళిక - వృషభగతిరగడ - త్రిపుటతాళము.

మఱియును మెఱయఁగ దిశలనియెడు నును
మడుగులు గట్టినశృంగారికినై
కొఱలినదయ బాణాసురు మోసలఁ
గూరిమిఁ గాచిన ఫణిహారికినై
మేలపుఁ జదువులు చదివిన విని మది
మెచ్చినలక్ష్మీపతి బావకునై
యీలువుగల సద్భక్తులు ముక్తికి
నేఁగెడు చేరువ పెనుత్రోవకునై
కూటికిఁ గూరకు కూరిమిభక్తుల
కొడుకుల నడిగెడి వెడజోగికినై

ఏటికి ఖోటికి జడలును నొడలును
నిచ్చిన జగదేకత్యాగికినై
ప్రొద్దును రేవెలుఁగును నేత్రములై
పొలయఁ గనుంగొనియెడు దేవునకై
నిద్దములగు పెద్దల పేరెలుకల
నెలకొనియెడు నిశ్చలభావునకై

ఉత్కళిక

కడు దీనతతో ముదితాపసికై
వడి నింటికిఁ జని వెడకప్పెరగై
కొని యాలుమగల పెనురచ్చలకై
చను దెండని నిక్కము సేయుటకై
వెనుద్రిప్పినగుండములో పలఁగై
కొని చని తనయెప్పటిరూపముకై
కొని గుండయ మెచ్చిన వేల్పునకై
వినతపితామహ ఫణితల్పునకై

పంచమివిభక్తి

ఉ॥ పోయెదుఁగాల, మన్యగతిఁ బొందదు మోక్షము, వెండికొండకుం
బోయెదు త్రోవమీ కెఱుఁగఁ - బోలదు మానవులార! రండు లేఁ
బ్రాయపుఁగొండ కందు శివ - భక్తులలోఁగొను నద్రిరాజక
న్యాయుతపుణ్యమూర్తివల-నం గడతేఱెదు జన్మఖేదముల్

కళిక - జయభద్రరగడ - జంపెతాళము.

మఱియు సకలాశ్రితుల-మనుచు నర్థమువలన
వఱలు పరమానంద-వనధితీర్థమువలన
కొమరుమిగిలిన మంచుఁ - గొండయల్లునివలన
విమతపురదహన కర - విష్ణుభల్లునివలన

శివభక్తహృదయ సం - చితనిధానమువలన
వివిధరూపములలో - వెలయు జ్ఞానమువలన
అజ్ఞాన ఘనతమం - బడచు దీపమువలన
సుజ్ఞానులకును బొడ - సూపురూపమువలన

### పంచమీవిభక్తి-ఉత్కళిక

తన కినుకలోఁ బుట్టి
కనలి దక్షునిఁ గొట్టి
యడరి వేల్పులఁ బఱచి
తొడరి జన్నము చెఱచి
వీరభద్రుఁడు వచ్చి
చేరి మ్రొక్కిన మెచ్చి
యలరుదైత్యునివలన
దళితదైత్యునివలన

### షష్ఠీవిభక్తి

చ॥ కమలజుతోరపుంబునుక - కంచేము, పాదసరోరుహార్చనా
కమలమువారిజోదరుని - కన్ను, కరంబున కాదిభోగి భో
గము రవణంబు చంద్రుఁడు శి - ఖాకుసుమంబటె యెవ్వరీ డుమా
రమణునకుం గుమారగిరి - రాజనివాసున కన్యదైవముల్.

కళిక - హయప్రచారము లేక తురగవల్గనము - రూపకతాళము.

మఱియు మెఱయు వేదవాద - మథన కథనసారమునకు
మెఱయు దట్ట ముట్టి ముట్టు - మేటినీటితీరమునకు
బత్తులుత్తులొరసి యొరసి - పట్టు గట్టి తేజమునకు
నత్తుఁ జిత్తుదానయైన - సత్యసత్యబీజమునకు
వలచి కొలుచు వారిఁ జేరి - వలపుఁదలపు దయ్యమునకు
నిలిచి నిలిచి చూడఁజూడ - నిండియుండు తియ్యమునకు
మునులు ఘనులు బోధవీథి - ముట్టినట్టి తత్త్వమునకు
పనులుఁ గనులునెఱుఁగనట్టి - పరమపదమహత్త్వమునకు

ఉత్కళిక

కదలి వదలి జూటకోటి
చదలఁబొదలనేటి నీటి
కడలఁగడలఁ జెంది చెంది
జడల నొడలఁ బొంది పొంది
బాలలీలఁ జూడ జూడ
సోలి లీలఁ గ్రీడలాడ
నాది నాథ జనకమునకు
వాదపూరి కనకమునకు

సప్తమీ విభక్తి

ఉ॥ వాచవిలోనుగా నొడలి - వాకిళులం జవిచూపుతీపులం
ద్రోచి శివార్చనానిమతి - తో వెలిచూడక చూడనేర్చినన్
లోచవిఁ బోలునే చవులు - లోకముఁ జూడనిచూపులం గుమా
రాచలనాథునందు బ్రతివు - రాంతకునందు కరంగు చిత్తమా!

సప్తమీవిభక్తి-కళిక
జయభద్రరగడ-జంపెతాళము.

మఱియునుఁ గటాక్షజిత - మారునందు
తఱిద్రొందు సొమ్మగు ను - దారునందు
బరులూను భక్తపశు - పాలునందు
కరుణా సుశీతకరి - కాలునందు
జగములు జనించు తొలి - జాడయందు
నిగమార్థముల్ నిలుచు - నీడయందు
పొడవెల్ల శాంతియగు - పుణ్యునందు
కడలేక యొప్పునర - గణ్యునందు.

ఉత్కళిక

ఇలయు సలిలంబు
వెలుఁగు ననిలంబు

దివియు మిత్రుండు
కువల యాప్తుండు
పరగు యజమాన
పరిపూర్ణుఁడైన
యష్టతను నందు
శిష్టనుతునందు.

సంబోధన

॥ శ్రీచనుదోయిపై శరముఁ - జేర్చి, భుజంగమరాజ నజ్యహే
మాచల మెక్కుడించి నిగ - మావళి యట్టులు పీడ్చి, పద్మజుం
జూచి మొగంబులిచ్చి దివి - జుల్ గొనియాడఁ గనున్న నీరణాం
తా చరణంబు విందు చెవు - లారఁ గుమారగిరీంద్రమందిరా!

కళిక - జయభద్రగడ - జంపెతాళము.

మఱియు నానామంత్ర - మణిగణసుధాకల్ప!
కొఱలు నేనుఁగుమోము - కొడుకుఁగాంచినవేల్ప!
మూఁడుమోముల పోటు - ముట్టుఁ బట్టెడుశూర!
వేఁడిచూపులఁ దియ్య - విలుతుఁద్రుంచిన ధీర!
తాపసుల యీలువుల - తనరు తపములపంట!
చూపులకు నెల్ల పర - సుఖవార్ధి పెన్నింట
తిలకాయమానదీ - ధితిసుధాసంసూతి!
వెలుఁగులకు నెల్లతొలి - వెలుఁగగు పరంజ్యోతి!

ఉత్కళిక

వినుతముఖనలినమును
ఘనజఘనపులినమును
వరవళితరంగములు
గురుకుచరథాంగములు

గలిగిన యుమాసరసి
లలితముఖముల బెరసి
క్రాలునొక కలహంస !
బాల చంద్రోత్తంస !

### సార్వవిభక్తికము

శా॥ నీవాద్యుండవు, నిన్నుఁదెల్పుచదువుల్ - నీచేత మేలొందు నీ
కై వాక్పూజలొనర్తు, నీవలన బ్ర - హ్మాండావళుల్ పుట్టు నీ
కే వేల్పుల్ సరి, అన్యదైవభజనం - బేనొల్ల నీయందు మ
ద్భావంబొందఁ దగున్ గుమారగిరినాథా! చంద్రచూడామణీ!

---

గ్రంథసూచి :—ముద్రితములు

1. త్రిపురాంతకోదాహరణము - విస్మృత కవులు -6. శ్రీమానవల్లి రామకృష్ణ కవి గారిచే, వనపర్తి, బ్రహ్మవిద్యావిలాసముద్రాక్షరశాలలో ముద్రితమై ప్రకటితమైనది - 1912.

2. శ్రీతిరుమల వేంకటేశ్వరపత్రిక - ఏప్రిలు 1933. ప్రకటనము. శ్రీరామకృష్ణకవి.

3. త్రిపురాంతకోదాహరణము. 1937- నిడుదవోలు వేంకటరావు. కాకినాడ ముద్రాక్షరశాల కాకినాడ.

4. ,, 1947 పునర్ముద్రణము, వావిళ్ల ముద్రణాలయము, మద్రాసు.

1. తాళపత్రప్రతి - ఒకటి మాత్రమే.

తంజావూరి శ్రీ సర్వతీ పుస్తక భాండాగారము. సంఖ్య. 166. M. 400. S. $16\frac{3}{8} \times 1\frac{3}{4}$. L. 11 11·8. G. 110.

1. కవిజీవితము. తెలుఁగు కవులచరిత్ర. 4 వ భాగము.

2. గ్రంథవిషయము. త్రిపురాంతకోదాహరణము. ప్రత్యేకగ్రంథము చూడఁదగును.

---

## —: ఉదాహరణ లక్షణములు :—

### విన్నకోట పెద్దన - కావ్యాలంకార చూడామణి

**పెద్దన జీవితము తెలుగుకవుల చరిత్ర ౫ వ భాగమున చూడనగును.**

కం॥ ధరఁ జాటుకృతులలోనం
బరగు నుదాహరణమను ప్రబంధము తద్వి
స్తరలక్షణంబు పరువడిఁ
బరికింపఁగఁ దగు నశేషభాషాకవులున్.

కం॥ చతురశ్రత్ర్యశ్రాదివి
తతయతితాళములు గలుగు దళములనెల్లన్
కృతగుచ్ఛానుప్రాసం
బతులితగతి నిలుపఁ దగు నుదాహరణలకున్.

కం॥ సురభాషాది ప్రాకృత
పరిభాషలనైన నితరభాషలనైనన్
విరచించుట యుక్త ముదా
హరణ మిలాసురముఖాదులగు పుణ్యులకున్.

విభక్తులకు మాఱుపేరులు—

సీ॥ ప్రథమావిభక్తి చొప్పడు వాణినాఁగ, రెం
డవయది ఘటనాఁగ నతిశయిల్లు
కీర్తి మూఁడవ విభక్తికిఁ బేరు, నాలవ
యది దేవలాభిని యండ్రు కృతులఁ
బంచమి పాణినాఁ బరగు, షష్ఠివిభక్తి
పాటిల్లు సుకవులు మోటినాఁగ
సప్తమీ ఘోటికా సంజ్ఞత సంబుద్ధి
సరసావళీనాము జగతివీని

విభక్తుల కధిదేవతలు—

కయినవేల్పులు వీరావళియును గీర్తి
మతి సుభగయును మఱి భోగమాలినియును

మహింగళావతియును గాంతిమతియుఁగమల
యును జయవతియునాఁగ నొప్పు నెపుడు.

కం॥ ఈవిదితాష్ట విభ క్త్యధి
దేవత లాత్మీయ నామధేయసమముఁగా
భావింపఁదగిన శుభములఁ
గావింతురు క ర్తృనాయక ద్వయమునకున్.

కం॥ మును శుభగణవర్ణ తఁబ
ర్వైన మాలినియొండె చండవృ త్తము యొండెన్
దనరింపవలయుఁ బ్రథమకు
ఘనకలికాష్టక తదర్థకలికాయు క్తిన్.

కం॥ ఇంబడరఁగఁ బ్రథమాదుల
సంబుద్ధ్యంతములనైన సరళవిభక్త్యా
లంబనపద్యమ్ములు బిరు
దంబులు గలపౌరుషములుదగ నిడవలయున్.

తే॥ కళిక యేతాళమునఁ బరిఘటితయయ్యె
నుత్కళిక యును దానన యునుపవలయు
నంత్యచాతుర్థి కోత్కళికాఖ్యఁజూడఁ
బడి చతుర్థినిఁ బోలె చూపట్టవలయు.

కం॥ ఓజఃపదబహుళము, వి
భ్రాజితపటుగాఢరీతి బంధురమును ని
ర్వ్యాజాతరసవిభావవి
రాజితమునుగా నుదాహరణఁ దగుఁజెప్పన్.

కం॥ నాయకవిభవమునకుఁ గవి
నాయకచతురతకు భాజనంబగు పద్యం
బాయితముసేసి యిడఁదగు
నాయతిగాఁదుదలయం దుదాహరణలకున్.

## స ద్ద ళి

కం॥ సంబుద్ధివిడిచి, మునుగల
సంబంధంబెడల కుండ, సప్తవిభక్త్యా
డంబరమెడలించిన నొడి
కంబగు సద్దళి యనంగఁగవులకుఁ జెప్పన్.

## ప ద్ద ళి

తే॥ సరివిభక్తులు సంబుద్ధిసహితఁగాఁగఁ
జెప్పనొప్పారుఁబద్దళి సిద్ధమగుచు

## వి ద్ద ళి

యుక్తసంబుద్ధి విషమవిభక్తికలిత
మైనకృతిపేరు విద్దళియంద్రు బుధులు.

## ర గ డ

కం॥ సరియెనిమిది రేకులచేఁ
బరువడి నుత్సాహవృత్త పదయుగళముచే
నిరవుగవడి ప్రాసంబుల
నరుదుగ రచియింప రగడయగు తగురీతిన్.

బిరుదావళి చక్రవాళలక్షణములు సంస్కృత భాగములోఁ జూడనగును

గ్రంథసూచి—కావ్యాలంకార చూడామణి. (వేదమువారి ముద్రణము 1929).
కావ్యాలంకార చూడామణి—

తాళపత్రప్రతులు— తంజావూరు పుస్తకభాండాగారము. సంఖ్య 6-92, 693.
మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాల సంఖ్య 11-18-18.

---

## ఉదాహరణ భేదము.

### (శ్రీనాథుని హరవిలాసము)

శ్రీనాథచరిత్రము :—తెలుఁగుకవులచరిత్ర - 5 వ భాగమున చూడనగును.

### విద్దళి

"సంబుద్ధితోడ విషమవిభక్తుఁ దోడఁ బలికిన కృతియు విద్దళి యగుఁగ".

- - అప్పకవీయము. (4-307)

హరవిలాసము. సప్తమాశ్వాసము. కిరాతార్జునీయకథ. 92-99 పద్యములు:—

ప్రథమావిభక్తి:—

క॥ నీవ పరబ్రహ్మంబవు
నీవఖిలాబ్జాండపతివి - నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః
ప్రావీణ్యప్రాభవైక - ఫలదుఁడవు శివా!

ద్వితీయావిభక్తి: —

క॥ నిన్నుఁ ద్రిజగన్నివాసునిఁ
బన్నగకంకణుని భక్తపరతంత్రుని స
భ్యున్నత కరుణాగుణ సం
పన్నునిఁ గనుగొంటి మంటి బాలేందుధరా!

తృతీయావిభక్తి: —

క॥ నీచేతఁ గృపానిధిచే
వాచాగోచర వివేకవైభూత్యునిచే
నోచంద్రకలాశేఖర!
యాచించి మనోరథార్థ - మర్థింగందున్

చతుర్థీవిభక్తి:—

శా॥ నీకై యేను దపంబుచేసితి మహా - నిష్ఠాగరిష్ఠస్థితిన్
నీకై సంస్తుతిసేయుదుం గడగినా - నేర్పొప్పఁగా నెంతయున్
నీకై పూజయొనర్తుఁ గ్రొత్తవిరుల - న్నిత్యంబుసద్భక్తితో
నీకై సేవయుహర్నిశంబొనరుతు - న్వేదండ చర్మాంబరా!

షష్ఠీవిభక్తి:—

తే. గీ॥ సాటియెవ్వరు నీకు నిశ్శాటజఘన
కైటభారాతిపాటక గర్భవంద్య
ఘన జటాజూట వాటి కాఘటిత వికట
గగనగంగాస్రవంతిక! కరటివైరి!

సప్తమీవిభక్తి:—

కం॥ నీయందు జగములుండన్
బాయక యాజగములందు బాయకనీవుం
దీయనువు దెలియ నజునకు
దోయజనేత్రునకునైనఁ దోపదు శర్వా!

సంబోధన :—

శా॥ జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయకామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా!
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయగిరీశా! యీశ! రక్షింపవే!

పై వానిలో పంచమీవిభక్తి లేక, సంబుద్ధితోఁగూడ నేడు విభక్తులు గావున విషమవిభక్త్యైనవి.

భీమఖండమున (1-118) భీమేశ్వరుని కొలువుకూటమున "షేరో లగంబుండి ... ... చంపూచాటునాటకోదాహరణజయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాతిప్రబంధంబులాకర్ణించుచు." అని ఉదాహరణములను శ్రీనాథుఁడు ప్రత్యేకముగ పేర్కొనినాఁడు.

గ్రంథసూచి. ముద్రితములు.

1. హారవిలాసము- 1901. సరస్వతీ పత్రికలో ముద్రితము.
2. ,, 1913. వావిళ్ల వారిచే ముద్రితము
3. ,, 1940. ఆనందముద్రణాలయమువారిచే ముద్రితము.
బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే పరిష్కృతము.

అముద్రితము - తాళపత్రప్రతులు -
తంజావూరి పుస్తకాగారము - సంఖ్య 286.
మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాల - సంఖ్య R. 104.

---

అనంతచ్ఛందస్సు :... ఛందోవర్ణనము - ఉదాహరణలక్షణము

[అనంతుని జీవితము - తెలుఁగు కవులచరిత్ర 6వ భాగము చూడుఁడు.]

సీ॥ భాసిల్లుసప్త విభక్తులందును మఱి
సంబోధనంబును సరవిఁగాఁగ
ప్రభునామయుతముగాఁ బద్యమొక్కటియునుఁ
దగఁజెప్పు రగడ భేదంబులందు
కళికలు ప్రత్యేకదళము లెన్మిది చేసి
తత్పూర్వముల నుత్కళికలనఁగ
నేకసమాసమై యేడుదళంబులు
తుదవిభక్త్యర్థంబు దోపఁ బలుక
తే. గీ. దానికెనఁగాఁగఁ జిక్కినదళమమర్చి
ఫణితు లొడఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టకడపట పద్యమొక్కటి రచింప
నది యుదాహరణంబగు నబ్జనాభ ! (3-68)

సీ॥ ప్రథమ విభక్తికిఁ బరగు వీరావళి
మఱి ద్వితీయకు* గీర్తిమతి దలంప
సుభగాభిధానమచ్చుగఁ ద్వితీయకు చతు
ర్థికి భోగమాలిని దృఢముగాఁగ

---

*పైవానిలో గీర్తిమతి, కళావతి, భోగమాలిని, జయగతి మొదలగునవి ఆయా పాత్రల పేళ్లనియు, తొల్లి దేవదాసీలీయుదాహరణములను చదివి నాట్యము సేయుచుండెడి వారనియు వారివారిపేళ్లుఆయా విభక్తులకుఁ బెట్టఁబడెననియు నిది ప్రాచీన సంప్రదాయమనియు బ్రహ్మశ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిగారు తెలిపిరి.

షష్ఠిఁ బంచమికి కళావతి కాంతిమతి షష్ఠి
కమరు నుదాత్త సప్తమికిఁ గమల
సంబోధనమునకు జయగతి యీగతి
దగు విభక్త్యధిదేవతాచయంబు

గీ॥ నెలమి నయ్యాయి విభక్తులనెసగఁ జెప్పఁ
గావ్యములను సంతోషించి కరుణతోడ
నాత్మనామాభిరూపఫలాభివృద్ధి
భర్తలకుఁ గర్తలకుఁ జేయుపద్మనాభ.

గ్రంథసూచి :—

అనంతచ్ఛందస్సు లేక ఛందోదర్పణము.

తాళపత్రప్రతి—

వ్రాఁతప్రతి - మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాల ఆర్. 530.

ముద్రితప్రతులు—

1. వావిళ్లముద్రణము - 1921 శ్రీగిడుగు సీతాపతి పీఠికతో ప్రకటితము.

2. ,, 1947 { డిటో. / నిడుదవోలు వేంకటరావు పీఠిక.

---

—: ఉదాహరణ లక్షణసూచనము :—

చింతలపూఁడి యెల్లకవి, (రాధామాధవకవి)

[రాధామాధవకవి శ్రీకృష్ణదేవరాయల కాలమున విలసిల్లినవాఁడు. ఈతని గ్రంథము లిదిగాక విష్ణుమాయా నాటకము, తారక బ్రహ్మరాజీయమును గలవు. వీనిలో విష్ణుమాయా నాటకము - మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రభాషాశాఖచేఁ బ్రకటితమైనది. శ్రీపీఠికాపురరాజేంద్రులు దీనిని పునర్ముద్రణము గావించిరి. తారకబ్రహ్మరాజీయ మముద్రితము.]

ఈతఁడు తన రాధామాధవమున శ్రీకృష్ణస్తుతియందు నుదాహరణ లక్షణములలో నొకటియగు సార్వవిభక్తిక పద్యమును రచియించినాఁడు. అది రగడలో నుండుటయు విశేషము.

మధురగతి రగడ :---

నీవే చిన్మయమూర్తివి తలపఁగ
నిన్నుం గొలువ శుభము సేకూఁగును
నీచేతఁ దమోవరణము విరియును
నీకై నుతివాఙ్మణు లొనగూర్చుట
నీ వలనఁ గృతార్థత్వము నొందుట
నీకును సరిగా రేవేలుపులును.
నీయందు దలంపులు నిలుపందగు
నీరేజాక్షా ! రక్ష సమస్తే

రాధామాధవము - శ్రీకపిలేశ్వరపురాధిపతులచేఁ బ్రకటితము. కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ. 1936.

1. రాధామాధవము—

తాళపత్రప్రతి ఆర్. 346 మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాల.

2. విష్ణుమాయా నాటకము డి. 787 డిటో.

వ్రాఁతప్రతి

3. తారకబ్రహ్మరాజీయము ఆర్. 347 డిటో.

ఈ తాళపత్రప్రతి - కీర్తిశేషులగు మానాపునగారు. సుందరము పంతుల వారు తొలుత దీనిని సంపాదించిరి. వారి భాండాగారమునుండియే యది ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో చేరినది.

# శ్రీ వేంకటేశ్వరోదాహరణము

## కవి:—తాళ్లపాక పెద తిరుమలయ్య (క్రీ.శ. 1463-1553)

[వేంకటేశ్వరోదాహరణమును రచించిన తాళ్లపాక పెద తిరుమలయ్య, తిరుపతిదేవస్థానమున మొదటి సంకీర్తనాచార్యులై మహాప్రసిద్ధిం జెందిన తాళ్లపాక యన్నమాచార్యుల పుత్త్రుఁడు. తాళ్లపాకవారు తొలుత నందవరీకులు, ఋక్శాఖీయులు, ఆశ్వలాయన సూత్రులు, భారద్వాజ గోత్రులు - కడపమండలములో, రాజంపేట తాలూకాలోని తాళ్లపాక గ్రామము వీరి తొలినివాసము - కావుననే తాళ్లపాక యూరిపేరు, వీరికింటిపేరైనది. వీరిలో తాళ్లపాక అన్నమాచార్యుఁడు, వైష్ణవము స్వీకరించి తిరుపతి వేంకటేశ్వరస్వామి సన్నిధిని సేవకై, తిరుపతినే నెలకొనెను. నాఁటినుండియు, సంకీర్తనాచార్యత్వము నెఱపుచు నేఁటికిని తిరుపతి వారినివాసస్థానమైనది.

పెద తిరుమలయ్య తండ్రి యన్నమార్యులు క్రీ. శ. 1408-1503 వఱకు 96 ఏండ్లు జీవించిరి. వారు క్రీ. శ. 1424 లో తమ 16 వ యేట శ్రీవేంకటేశ్వర సన్నిధానమున సంకీర్తనలు చేయుట ప్రారంభించి, 80 యేండ్లు సేవచేసి, 23-2-1503 తేదిని వైకుంఠవాసులైరి. ఆనాఁడే, సంకీర్తనాచార్యత్వము, తన కుమారుఁడగు పెద తిరుమలయ్యకిచ్చి, సేవచేయనాజ్ఞాపించిరి. పెద తిరుమలయ్య గారి కానాఁటికించుమించుగ 40 యేండ్లుండుటచే వీరిజన్మకాలము 1463 ప్రాంతము కాఁదగును. పెద తిరుమలయ్యయును క్రీ. శ. 1553 వఱకును నఖండముగ శ్రీ వేంకటేశ్వరుని సేవచేసి ఆయిదుగురు పుత్త్రులఁబడసి సంకీర్తన గ్రంథరచన కావించి, సాహిత్యపథకము జవిజూచి, కృతకృత్యుఁడయ్యెను. ఈతని నాల్గవ కొమారుఁడే యీతరువాత తాళ్లపాక కవులలో మహాప్రసిద్ధికెక్కిన చిన్నన్న. తన తండ్రివలె, పెద తిరుమలయ్యయును చిరకాలజీవియై యుండెను. ఈతఁడు జీవించియుండిన కాలముననే, నీతని పెద్ద కొమారుఁడు, తిరుమలయ్య పెద్దవాఁడగుటచే, కొమారుని చిన తిరుమలయ్యయనియు, తండ్రిని పెద తిరుమలయ్యయనియుఁ బిలిచెడివారు. అవియే గ్రంథములలో కూడ రూఢములైనవి.

ఈ క్రింది వంశవృక్షమువలన పైని వివరించిన విషయములు స్పష్టపడగలవు.




పెద తిరుమలయ్య, తండ్రియగు నన్నమాచార్యులవలె చాలప్రసిద్ధులగుటచే వారెన్నియో విధముల వ్యవహృతులగుచుండెడివారు " పెద తిరుమలాచార్యులు, పెద తిరుమలయ్యంగారు, అన్నయ, తిరుమలయ్య, అన్నయ తిమ్మనార్యులు, పెరియ తిరుమలయ్యంగారు, తిమ్మయ, తిమ్మయార్య, తిరుమల, తిరుమలాచార్య, తిరుమల గురు, తిరుమలార్యదేశిక, తిరుమలయ్యంగారు, తాళ్లపాక తిరుమలయ్య." ...... ఈతని నాల్గవ కొమారుఁడు తాళ్లపాక చిన్నన్న, తనకృతులలో నీతని తండ్రినిఁ గూర్చి యిట్లు ప్రశంసించియున్నాఁడు.

" అష్టమహిషీ కల్యాణము (4, 5 పుటలు 80-108 ద్విపదపంక్తులు)
అక్కలాంబుధి కన్యయన నొప్పునట్టి
అక్కలాంబకు సుముఖాబ్జ బింబకును
గరిమ నంబుధిసుధాకరుఁడు జన్మించు
సరళిమై తిరుమలాచార్యుండు వొడమె
............ఉరుయోగ సామ్రాజ్యవిభవ
జనకుఁ డాతిరుమలాచార్యవర్యుండు
వేదాంత విద్యాప్రవీణుఁడై యాంధ్ర
వేదాంత మొనరించె, ద్విపదరూపమున
హరివంశకావ్య మాయతరసస్ఫూర్తి
హరివంశ మిగురొత్త ననువొందఁ జేసి

చక్రవాళములోన సరిలేదనంగ
చక్రవాళముగ మంజరి రచియించి
శ్రుతులచిక్కులు దీర్చు శుకతాతవోలె
సతతరేఫలకారసరణి తేర్పఱచి
సంగీతసాహిత్య సార్వజ్ఞకత్వ
మంగళ సామ్రాజ్యమహితుఁడై యలరె
మండెముకోటలో మండలం బేలఁగ
మండలాగ్రాహతి మండితపుష్ప
దామమై ధర్మాంగదస్థితిఁ బొలిచె
నేమహామహుని యహింస గాత్రమున
నాపావనాత్ముని యంగనామణి
రూపపాతి వ్రత్యరుచిర భావముల
సరసిజాలయఁబోలు సాధ్వీలలామ
తిరుమలాంబయనంగ తేజంబుమెఱసి
యరుదొంద నయ్యింతియలపంచకల్ప
తరువులు నానొప్ప తనయరత్నముల "

పెదతిరులయ్య కృతులలో, ఆంధ్ర వేదాంతమును, హరివంశమును మనకు లభ్యము కాలేదు. తక్కిన కృతులఁ గూర్చి వివరించెదను.

### నీతిసీసపద్యశతకము

ఇది సీసపద్యశతకము "కలితలక్ష్మీశ సర్వ జగన్నివేశ! విమలరవికోటి సంకాశ వేంకటేశ!" అను మకుటము - ఇందు నూఱుపద్యములు - ఇందు లోకనీతియేగాక రాజనీతియుం బ్రస్తుతమైయున్నది - తెలుఁగు భాషలో లోకనీతిని పెంపొందించి రాజనీతియందలి దోషముల గర్హించు శతకముల కిదియే మూలము - ఇది కృష్ణదేవరాయలసభలోఁ జదివి వినిపించినట్లు, తెనాలిరామలింగని జీవితములోఁగల 'పాతివ్రత్య ప్రదర్శినీ తిరస్కారము' అను విషయము తెల్పుచున్నది. "పతికి మాఱాడక, పలుమఱు నేడ్వక, యలయక మిగులఁగయ్యాళిగాక" అను పద్యపాద మీ శతకములోనిదే యగు 32 వ సీసపద్యములోని తొలిపాదము - దీనినే రామలింగఁడు హేళనఁగావించినాఁడు. దీనివలన నీ శతకము క్రీ.శ. 1526,30 ప్రాంతములకు ముందే రచితమైనట్లూహింపఁ దగియున్నది - ఇది ముద్రితము -

1. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతి -
2. తిరుపతి దేవస్థానము ప్రతి - (తాళ్లపాకవారి లఘుకృతులు - పుటలు- 20-54)

## 2. శృంగార వృత్త పద్యశతకము.

పేరును బట్టి యిది శృంగారపరమనియు, చంపకోత్పలాదివృత్తములతో కూడి కొన్నదనియు తెలియనగును. ఇందు 103 వృత్తములు గలవు. ఇది శ్రీ వేంకటేశ్వరస్వామి, యలమేలుమంగ శృంగారలీలలు ప్రపంచించు శతకము - ఇందు, 3 శార్దూలములు, 14 మత్తేభములు, 27 చంపకములు, 59 ఉత్పలములు గలవు. చంపకోత్పలములలో 'వేంకటేశ్వరా' అను మకుటము - మత్తేభశార్దూలములలో 'వేంకటాద్రీశ్వరా' అను మకుటము 50 వ పద్యమున 'వేంకటశైలనాయకా' అనియు, 63 వ పద్యమున 'శేషగిరీంద్రనాయకా' అనియు, 66, 84, 86, 100 పద్యములలో తిరు 'వెంకటేశ్వరా' అనియు మకుటములు గన్పట్టుచున్నవి. తండ్రి అన్నమాచార్యులు రచించిన 'వేంకటేశ్వర శతకము' ననుసరించి యీ శతకమును నీతఁడు చెప్పియుండఁదగును. ఇందు, ముక్తపదగ్రస్తములు, యమకములు - పాదమధ్యమున యమకములు గలవు. ఇది ముద్రితము.

1. దేవస్థానప్రతి - పుటలు 118-136 పుటలు.

## 3. చక్రవాళమంజరి.

ఇది దేశికృతులలో లెక్కింపఁదగినకృతి. ముక్తపదగ్రస్తముగా మంజరీ ద్విపదలో వేంకటేశ్వరుని పేర రచితమైనది. లక్షణగ్రంథములలోనిచ్చిన లక్షణమునకు నిదియొకలక్ష్యము - 113 పంక్తులుగలవు. దీని స్వరూపముఁ దెలియుటకు నిందు కొన్ని పంక్తు లుదాహరించు చున్నాను. ఇది ముద్రితము.

శ్రీలలనాధారుఁ జిన్మయాకారు
కారుణ్యవర్తి వేంకటగిరిమూర్తి
మూర్తిత్రయశరీరు మునిజనోద్ధారు
ధారుణీసంగు సత్తమశోభితాంగు
.................. చంద్రికలు
కలుగంగఁ జెలికినగ్గలమయ్యెజాలిఁ
జాలించి నీరుబ్బఁ జంద్రకాంతముల
తములాలనము సేయఁ దగుననిగునియ
.................................
పేరఁగు జవరాలి పెనిమిటి పేరఁ
బేరఁ గీర్తనకెక్కి శిరసింపదవర
వరముఖ్యుఁడై భరద్వాజసంతాన
తానకుండన నెన్నఁదగు తాళ్లపాక
పాకశాసనుఁడు వైభవముల నొనరు
నరులలోఁ బూజ్యుఁడన్నయవర్యతనం

నయశాలి తిమ్మయ్య నవచతురతలఁ
దలచి మంజరిఁ జెప్పెఁ దజ్ఞాలింపార
సారవితారాజ్ఞమై యొప్పుజగతి
గతియైన విష్ణుమంగళమహాశ్రీలు.

ఇది దేవస్థానపుప్రతి - 14-20 పుటలు.

4. సుదర్శనరగడ.

ఇది శ్రీమహావిష్ణువు పంచాయుధములలో నొకటియగు సుదర్శనచక్రముపై చెప్పఁబడిన రగడ - ఇందు 108 చరణములు గలవు. ప్రతిచరణమున చక్రపదము గలదు. ప్రతిచరణద్వయమునకుఁ ప్రాసపాటింపఁబడినది. చరణమధ్యమున యతి గలదు. దీని స్వరూపమును వివరించెదను.

ఓంకారాక్షర - యుక్తము చక్రము
సాంకమధ్యవల - యాంతరచక్రము
సర్వఫలప్రద - సహజము చక్రము
పూర్వకోణసం - పూర్ణము చక్రము
... ... ... ... ... ... ... ...
విహ్వాలితనరక - వీరకచక్రము
సైంహికేయగళ - సంహారచక్రము
... ... ... ... ... ... ... ...
కల్హారమాలి - కాధర చక్రము
సిల్హాధూపసం - శ్లిష్టము చక్రము
... ... ... ... ... ... ... ...
భావించునుజన - పాలన చక్రము
శ్రీవేంకటపతి - చేతిది చక్రము.

తాళ్లపాకవారు సుదర్శనచక్రోపాసకులుగావున నీరగడరచనను వెనుక, నీతఁడొరులు, చిన తిరుమలయ్యయును, చిన్నన్నయు నీచక్రముమూర్తిని ప్రతిష్ఠించి, పూజాదికములు జరుగుటకు నిత్యముగ నేర్పాటుచేయించిరి.

5. రేఫ 'ఱ' కార నిర్ణయము.

ఇది రేఫ' ఱకారములను రెండువిధములుగాఁ దెలుఁగుభాషలో వెలయు రెండురకారములఁ గూర్చి తెలియఁజేయు కందపద్యగ్రంథము. తెలుఁగులాక్షిణికులలో నీనిర్ణయము చేసినవారిలో నీతఁడే మొదటివాఁడు. ఈ తని వెనుక లక్షణగ్రంథములోనా, ప్రత్యేకముగను వీనినిఁగూర్చి వివరణ గ్రంథములలోను నీవిషయము విస్తృతమైనది. కాని సంప్రదాయసిద్ధముగ నీవిషయమునుఁ గూర్చి తెలిసికొను భాషాతత్త్వవేత్తలకు, వైయాకరణులకు నిది తొలి గ్రంథమగుటచే చాలయుపకరించినది.

కావుననే మహాప్రసిద్ధుఁడైన యప్పకవి, (క్రీ.శ. 1656) తన గ్రంథమున రేఫఱకార సీస మాలికలో నీతనిఁ బ్రత్యేకముగఁ జేర్కొనినాఁడు. ఈ గ్రంథరచనా కాలమున కీతఁడు యత్యాశ్రమమును స్వీకరించినటుల గ్రంథాంతమందలి యీక్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

గీ॥ క్షీరనీరవిభేదంబు చేసినట్లు
ధరణి రేఫఱకారముల్ తాళ్లపాక
తిరుమలార్యుండు వేర్వేఱ దేటపఱచె
నుచితమది గాదె పరమహంసోత్తమునకు.

అందులో 55 కందములు రేఫలనుగూర్చియు, 52. పద్యములు ఱకారములనుఁగూర్చి యుకలవు. అన్నింటికిఁ గృష్ణాయని మకుటము. గ్రంథాదియందు, 5 పద్యములలో నీ గ్రంథవిషయతత్త్వము నెఱుఁగఁబడు చున్నదిగాన దాని నిట నుదహరించు చున్నాఁడను.

కం॥ శ్రీవేంకటేశ నీకుం
గావించెద నంకితంబుగా నారేఫల్
వావిరి నేర్పఱచిన కృతి
శ్రీవనితారామనాథ! చేకొనుకృష్ణా!

కం॥ అచ్చులు హల్లులు వరుసను
వచ్చిన రేఫలును ఱాలు వర్ణించెను మున్
మెచ్చుగ నాదికవీశ్వరు
లచ్చుపడం గృతులఁ జెప్పినటువలె కృష్ణా!

కం॥ ఇచ్చిరి తెచ్చిరి యనియెడి
యచ్చతెనుంగులఁ గ్రియాపదాంతంబులపై
వచ్చినవియెల్ల రేఫలు
రచ్చలజడ్డలవి ఱాల రచనలు కృష్ణా!

కం॥ ఇలఘోషాక్షరములపై
గలుగవు, తెలుఁగుననే, ఱాలు కడగును, రేఫల్
తలఁపగ సంస్కృతపదములఁ
గలిగినవియు రేఫలయ్యె గనుగొన కృష్ణా!

కం॥ ఎఱుక, యొరవనుట మొదలుగ
మొఱపెడియెత్వములు నిత్యములు తెలుఁగుననే
ర్పఱచినవి యెల్ల నచ్చులు
పెఱిగి ఱకారములు గావు పెంపున కృష్ణా!

గ్రంథప్రారంభమునకు ముందు “తిరుమలయ్యంగారు కవిత్రయము మొదలైన పూర్వపు కవీశ్వరుల ప్రబంధములలోని రేఫ‘ఱ’కారము లేర్పఱచి లక్షణ

గ్రంథముగా నానతిచ్చిన రేఫఱకారముల పద్యాలు" అని యుండుటచే నిది బాగుగ పరిశీలన చేసినవెనుక వ్రాయఁబడినది. గ్రంథము నేఁడును ప్రామాణికముగాఁగొనఁదగినది. గ్రంథమున పదజాలమును, వర్ణక్రమమును ననుసరించి యీయఁబడినది. ఇందీయఁబడిన రేఫఱకారములు కొన్ని, నేఁటికి మనకు లభ్యములైన ప్రయోగముల ననుసరించి సంశయాస్పదములుగా నున్నను, తొలు దొలుత భాషాతత్త్వశాస్త్రమునకు సంబంధించిన యిట్టివిషయముఁ గూర్చి ప్రత్యేకముగ నీతఁడు చేసిన కృషి శ్లాఘనీయమని చెప్పనొప్పును - ఒకటి రెండుదాహరణములఁ జూపెదను.

'కొరప్రాణములనఁగ రేఫగుణములు కృష్ణా' అని కొరప్రాణములోని కొర రేఫగాఁ జెప్పియున్నాఁడు కాని రంగనాథరామాయణమున నుత్తర కాండలో

"అతిమి కొందఱు చచ్చిరావావక్షోణి
కొఱప్రాణముల తోడఁగొందఱుఁ పడిరి". (77 పుటట 12 పంక్తి)

అనికలదు. దీనికి సాధురేఫగలనిర్ధారకప్రయోగములు కన్పట్టుటలేదు. తరిత్రాడు - "తరిత్రాడు - తరువ - "ఇది సాధురేఫగా నీయఁబడినది

త్రిపురాంత కోదాహరణములో—

మఱియుఁ గటాక్షజితమారునందు
తఱిత్రాడు సొమ్మగు నుదారునందు.

అని శకటరేఫగా ప్రయోగము కలదు - ఇట్లు కొంతవిమర్శనమున కెడమున్నను నిది, మార్గదర్శకగ్రంథమని *చెప్పనొప్పును - దీనిముద్రితప్రతులు

1. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక - 3 సంపుటము (1915) 430-434 పుటలు
2. తిరుపతి దేవస్థానప్రతి. (68-56 పుటలు)

### 6. శృంగారదండకము.

ఇదియు శ్రీవేంకటేశ్వరస్వామిపై నె చెప్పినదియే-ఉభయభాషావైదుష్యము చే శృంగారరసము నుద్దీపింపఁజేయు నీదండకము ముక్తపదగ్రస్తయను కాలంకార బంధురమై యున్నది. దండకము చివర-

ఉ॥ సన్నుతి తాళ్ళపాకపురశాసనుఁ డన్నయ తిమ్మనార్యుఁడ
త్యున్నతిఁ జెప్పె దండకము దుగ్ధపయోనిధి కన్యకారతి
స్విన్నమృగీమదాంకునకు, వేంకటభర్తకు నిత్యభోగసం
పన్నన కారవీందుకుల పర్వతతారకమై చెలంగఁగాన్.

ఇందు ముద్రితమున 150 పంక్తులు కలవు. ఇది ముద్రితము - పైగ్రంథమే
(86-నుండి 93 పుటలు)

---

*వైయాకరణ పారిజాతము, అంతస్థ ప్రకరణమున నీగ్రంథప్రాశస్త్యము గుర్తింపనగును. (పుటలు- 397-441-442)

—ఆంధ్రవిజ్ఞానకోశపరిషత్ప్రకటితము 1937

## 7. మేలుకొలుపుద్విపద-

ఇది ప్రభాతసేవకై తిరుమలయ్యరచించిన లఘుకృతి - ఇది ప్రాతఃకాలమున పఠించుటకు బహు మనోహరముగనుండును.

శ్రీగురు దర్శితో శేషాద్రియందు
యోగనిద్రాకేళి యున్నయా త్తజిని
వనజాసనాదిదేవత లేగుదెంచి
వినిపించి రపుడు నవ్విధమెట్టిదనిన
.......... .....................
శ్రీకర వేంకట క్షితిధరవాస!
నాకేశనుత! రమానాథ! మేల్కొనుము
వసుదేవ దేవకీ.వరగర్భజాత!
కిసలయాధర! రామకృష్ణ! మేల్కొనుము
భోజకన్యాముఖాంభోజ ద్విరేఫ!
రాజీవనయానాభిరామ! మేల్కొనుము
మంజుల సత్యభామా మనస్సంగ
రంజిత గోత్రసంరంభ! మేల్కొనుము
తారుణ్యమిత్రవిందాకుచమధ్య
హారసంయోగ విహార! మేల్కొనుము
లలిత కాళిందీవిలాసకల్లోల
కలితకేళీలోల ఘనుఁడ! మేల్కొనుము
లక్షణాపరిరంభలక్షితోదార
వక్షోవిశాల కవాట! మేల్కొనుము
వరరూపవతి జాంబవతితోడిగతుల
నిరతిమైనోలాడు నిపుణ! మేల్కొనుము
కలితనక్రగ్రాహగంభీర జలధి
వలయితద్వారకావాస! మేల్కొనుము
జలదనీరశ్యామ! జగదభిరామ!
.......... ...........
వెలయ మేల్కొనుమని విన్నవించుటయు
అనిచెప్పి తాళ్లపాకాన్నయాచార్య
తనయతిమ్మార్యుడు తగ విన్నవించు
ఏచియాకృతి ధరణీశ్వరుసభల
నాచంద్రతారార్కమై వెల్గుగాత!

ఇదియముద్రితము - ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకాగారమున వ్రాఁతప్రతి నుండి పైపంక్తులు నేనుద్ధరించి, భారతియందు, తాళ్లపాకకవు లనువ్యాసమునఁ బ్రకటించితిని. (భార - కార్తికము). 700 పుట.

8. సంకీర్తనలక్షణము.

తాళ్లపాక అన్నయాచార్యుఁడు సంస్కృతమున రచించిన సంకీర్తనలక్షణమునకు పెదతిరుమలయ్య వ్యాఖ్యానము రచించినట్లా గ్రంథము పద్యరూపముగ రచించిన చినతిరుమలయ్య యిట్లు చెప్పియున్నాఁడు—

మ॥ ధరలో తాళులపాకయన్నయ గురూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మునుఁ జేయఁబూని తగనుత్పాదించె, తల్లక్షణం
బరుదై మించిన సంస్కృతంబునఁ గవీంద్రానందసంధాయియై
పరిపూర్ణాఖిలశాస్త్రిసమ్మతముగా భావజ్ఞ తానాననన్.

ఆ. వె. అలరు తాళ్లపాక అన్నయార్యసుతుండు
తిరుమలార్యుఁ డఖిల దేశికుండు
తత్సుతాగ్రజుండ, ధరలోనఁ జినతిమ్మ
యాహ్వయుండ, తండ్రి యనుమతమున.

మ॥ పరమామ్నాయసమానమై వెలయు మత్పైతామహగ్రంథమున్
వరచాటూక్తిమదీయపుణ్యజనక వ్యాఖ్యాతమున్, వేడ్కదా
చరణాంభోరుహముల్ మదిందలఁచి, సచ్ఛాస్త్రిజ్ఞులింపొందఁగా
వరుసన్ జెప్పెడిఁ బద్యరూపమునఁ దద్వ్యాఖ్యానుసారంబుగన్.

—సంకీర్తనలక్షణము, 15,16,17 పద్యములు

ఈవ్యాఖ్యానము, తెనుఁగు వాక్యములతో రచితమైనట్లు తెలియుచున్నది. కాని యిది నేఁడులభ్యము కాలేదు. ఇట్టి తెనుఁగువ్యాఖ్యానములు కూడ తిరుమలయ్య వ్రాసినట్లతని భగవద్గీత తెలుపుచున్నది.

9. భగవద్గీతావ్యాఖ్యానము.

ఇదివచనరూపమగు గ్రంథము. టీకవ్యావహారిక భాషలోగలదు.

10. వేంకటేశ్వరవచనములు.

ఇవి 48 వైరాగ్యవచనమాలికాగీతలను పేర ముద్రితమైనవి.

ఇందులో మిగిలిన 42 వచనములు కలిపి, వేంకటేశ్వర వచనములుగా ముద్రితములైనవి. ఇవి వచనములైనను పాటలవలె పాడదగినవి. శ్రీతిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాలయమువారు ముద్రించిరి:—

[గ్రంథవిషయము, శ్రీవేంకటేశ్వరుఁడు విష్ణుమూర్తియే కావున నిందు రామకృష్ణాద్యవతారముల లీలలు వర్ణితములైనవి.]

## ప్రథమావిభక్తి

[శ్రీతిరువెంగళనాథదేవునికిఁ దాళ్లపాక అన్నమాచార్యుల కొమారుండు పెదతిరుమలాచార్యులు విన్నపము చేసినయుదాహరణ.]

ఉ॥ శ్రీకరుణాకరుండగుచు - జీవుల తీవులఁ బ్రోచి కాచుచుం
గైకొని లోకముల్ మనిపి - కర్తయు భర్తయునైన మున్నుల్ సురా
నీకము లోకముం బొగడ - నీరజజాతుని తాతయైన సు
శ్లోకుఁడు వేంకటేశ్వరుఁడు - చూడఁగనొప్పెడు బ్రహ్మమింతకున్.

### కళిక - వృషభగతిరగడ

మఱియు నెఱుకలకెల్ల నెల్లగు - మహితహితజనకల్పభూజము
మెఱపులోఱపులుఁ జెలఁగు వెలుఁగుల-మించుమించుల మొదలి తేజము
మడుఁగువెడలని చిలువచెలువము - మాయఁజేయు మహానుభావుఁడు
జడధినడుమను తెరువుకిరివగ - జరపి పఱపిన దేవదేవుఁడు
కరములురలఁగ బాణుప్రాణము - గాఁచి యేఁచిన నాఁటి నేర్పరి
సొరిది బిరుదుల యసురనిసరము - స్రుక్కఁ ద్రొక్కిన వేల్పుఁదీర్పరి
పడగలడరెడు శయ్యనెయ్యపు - భామఁబ్రేమరమించు చెలువుఁడు
జడికి గొడుగుగఁ గేలశైలము - చాటు వీటికి జేయుబలువుఁడు

### ఉత్కలిక

దురితవిరహితగురుఁడు వేదపు
శరధి నురుతర శాస్త్రవాదపు
నగము సుగుణపు గుణముఁ జుట్టుచు
పొగడఁదగు సత్త్వమునఁ బట్టుచుఁ
గరలి తరువఁగ నరుడు మీఱఁగ
సురలదొరలకు నోరులూఱఁగ
నంది పొడమిన యమృతసారము
నందవనితానందపూరము

## ద్వితీయా విభక్తి

ఉ॥ ఏఁటికి వేల్పులార! చద - లేటికిఁ బోయెదరిందురందు కో
నేటికి వచ్చుఁ దీర్థచయ - మేఁబదిలక్షలదోడఁగూడు ము
క్కోటియునంచుఁ బల్కుముని-కోటుల మాటలు నేర్చి, కీరముల్
చాటు తటాటవిన్నటన - సల్పెడు వేంకటభర్తఁ గొల్చెదన్.

### కళిక

మఱియు నెఱిఁగినబుధుల-మనసు లెనసినవాని
మెఱుఁగులకు గుఱియైన - మేనుపూనినవాని
గొల్లెతల నెల్లెడలఁ - గూడియాడినవాని
మల్లులను విల్లునటు - మట్టికొట్టినవాని
జక్రమున నక్రమును - జడియనడచినవాని
శుక్రుడొకవక్రగతి ... .. ... ... ...
వీరుఁడగు కౌరవుని - వీడనాడినవాని
శూరుడఁగు సీరితో - జోడుగూడినవాని

### ఉత్కళిక

మేడెములుగూడుకొని
వాడలనుదాడిగొని
యుట్టులనుఁ జట్టులనుఁ
దెట్టెలుగఁ గొట్టిచని
యాటలనుఁ బాటలను
జోటులను మాటుకొని
కలసిమెలసినవానిఁ
దులసివలసినవాని

## తృతీయా విభక్తి

ఉ॥ తీఱునఘంబులెల్ల నిలుఁ - దీర్థమువచ్చినయంత సంపదల్
మీఱు సుఖంబుగూరు - మతి మిక్కుటమైశ్రుతివీథిఁదూఱు వే

నూఱులుఁ జెప్పనేల సుమ - నోవిభుచేఁ దిరువేంకటేశుచేఁ
జూఱలుగావరంబులిల - జొప్పడఁ గొందము రండు మానవుల్

కళిక - హయప్రచార రగడ

మఱియు వఱలు సుజనభజన - మాన లేనివాని చేత
వెఱపుమఱపు లేక జోక - విడువకడరు వాని చేత
శ్రుతుల గతుల నడువ నుడువఁ - జొక్కిచిక్కు వాని చేత
అతులమతులఁ జెలఁగి మెలఁగి - నట్టిగుట్టు వాని చేత
సగము మొగముచాయ డాయ - జదియనదుచు వాని చేతఁ
బోగులు మగువ వలువలొలుపఁ - బ్రోచి కాచు వాని చేత
ఱాతినాతిఁ జేసి వాసి - ఱట్టుపెట్టు వాని చేత
వాతజాతుఁ బనుఁ గొనుచు - వసుధ నెసఁగు వాని చేత

ఉత్కళిక

పురము లెఱియ శరమునంగ
బరగి దురము పురికొనంగఁ
బగతు లగల మిగులఁ గొట్టి
నగజమగఁడు పొగడునట్టి
గెలుపునిలుపు తలఁపు లెంచి
బలము చలము కలిమి మించి
జనుల మనుపు ఘనుని చేత
వనజతనుజ జనకు చేత

చతుర్థీ విభక్తి

ఉ॥ భావజతండ్రియై కుసుమ - బాణుని మామమఱందియై చకో
రావళిమిత్రుఁ గన్నతని - యల్లుఁడునై జలరాశినాత్మమా
యావటపత్రశయ్యసఖి - లాబ్జభవాండపుగుడ్లఁ బెట్టునం
చై విలసిల్లు వేంకటవి - హారునకై నుతు లేనొనర్చెదన్.

## కళిక - వృషభగతిరగడ

మఱియును గోఱగలపుఱుమికి నొడికపు
మగఁడై నెగడెడు నఖిలేశులకై
కఱకఱి మెఱయ సృగాలునిఁ గాలుని
గనుగొనబనిచిన విజితాశునకై
కన్నుల వెన్నెలయెండయు మొండుగఁ
గాయఁగఁ జేయఁగఁ గల విష్ణునకై
జన్నము లెన్నడు చదువుల పదవుల
సరణుల దిరిగెడువర్ధిష్ణునకై
జగముల మగఁటిమిఁ గావఁగఁ బ్రోవఁగఁ
జాలిన యేలికయగు మూర్తికినై
తగులమి మిగులఁ బ్రపన్నులసన్నిధిఁ
దరలకమరఁగిన వరకీర్తికినై
నరులకు సురలకు ముంగిటఁ
జెంగట నమ్మినసొమ్మగు నగధీరునకై
యురమున సిరి గడుఁ జెలఁగఁగ మొలఁగెడు
నున్నత సన్నుత మణిహారునకై

## ఉత్కళిక

ధారుణి భారనివారణకలనకై
శౌరవిహార విచారమనెడికై
తవమున జపమున బవిరితిరుగుకై
దువ్వుఁ గొని వివిధసవిధదానవకై
కసరుధిర సలిలమొసఁగ విసరికై
వసముగ సురవిసరము నేలిన కై
లాసనివాస సతీవంద్యునకై
హాసనమున్నత బుధవంద్యునకై

## పంచమీవిభక్తి

ఉ॥ కొండలవంటి సంపదలు - కొండనివేగమె చాగమిచ్చుచో
గండరగండఁడై పసిఁడి - కంబమునం బడగెత్తియుల్లస
త్కుండలమండలాధిపతి - గోత్రవిచిత్రనివాస సౌఖ్యమున్
దండిగఁ గాంచు వేల్పువల - నన్ సుఖమందెద మెల్లకాలమున్.

## కళిక

మఱియు గుఱుతగు గుణసు - మణులు గలపతివలన
మఱఁగుమొఱఁగులు లేని - మానవుల గతివలన
గురువరుని గతసుతులఁ - గూర్చుశూరునివలన
బురహరుని పగతుఁడెగఁ - బోరుధీరునివలనఁ
గమలమునఁ దనయుఁగను - గరుడవాహనువలన
నమితహితయువతితతి - నవ్యమోహనువలన
నలువనెలవవల భ్రువు - నకు నొసగు హరివలన
కలువచెలిచెలియలిని - గలయు బిత్తరివలన

## పంచమీవిభక్తి ఉత్కళిక

తెఱఁగు లెఱుఁగనిబండి
విఱిగి రొఱఁగఁగఁ జెండి
యుద్దిమద్దులవ్రాల్చి
గ్రుద్ది యొద్దులఁ గూల్చి
ఘాతఁబూతనఁదీర్చి
చేత నేతులు గూర్చి
యున్న వెన్ననివలన
నున్నతోన్నతువలన

## షష్ఠీవిభక్తి

ఉ॥ మానిసిదిండ్లమొత్తు నెఱ - మంటలపిల్లలకత్తివేల్పు పెన్
బోనపుముద్ద నిద్దముల - పొల్పుదొలంకెడు సంకుఁగల్గు నె

వ్వానికి వానికి స్నుతభ - వానికి వేంకటశై లశృంగస
న్మానికి భ క్తసంపదభి - మానికి నే శరణంచు మ్రొక్కెదన్.

క ళి క

మఱియు నెఱియు మంత్రతంత్ర - మర్మధర్మకీలకునకు
చిఱుతయుఱుత భ క్తిశ క్తిఁ - జెలఁగి మెలఁగు పాలకునకు
సోమధామనూత్నరత్న - సుకరమకరకుండలునకు
సామభూమగానమాన - స క్తభ క్తమండలునకు
బంతిఁగొంతి తనుజానుజు - బండినుండు మాధవునకు
జంతయింతి గందమంది - చక్కనొక్క భూధవునకు
రాజితాజి కుంభికుంభ - ర క్తసి క్త భీకరునకు
భోజరాజపుత్రిమైత్రిఁ - బొదలి యొదలు శ్రీకరునకు

ఉ త్క ళి క

భువనసువన ఫలములలమి
జవనపవన బలముకలిమి
మొదలుపొదల మరఁగి తిరిగి
చదలతుదలకరిగి పెరిగి
రేవుమావు మించిపొంచి
రూపుచూపి సంచరించు
యోగరాగ కీరమునకు
యాగభాగసారమునకు

స ప్తమీవిభ క్తి

ఉ॥ కోరిపదారువేలయిన - కోమ్మలనెమ్మదిఁ బెండ్లియాడియున్
ధారుణిబ్రహ్మచారినని - తప్పకపల్కి పరీక్షుతున్ మహా
దారతఁబ్రాణమెత్తుచుఁబ్ర-తాపమువీడఁగఁబ్రోచుమోహనా
కారునియందు వేంకటశి - ఖామణియందు మనంబు నిల్పెదన్.

## సప్తమీవిభక్తి-కళిక

మఱియు శోభిగుణాభి - మానియందు
తఱినాభి జనితాభి - ధానియందు
శతపత్ర సమనేత్ర - శౌరియందు
తతచిత్రతర గోత్ర - ధారియందు
శతకోటి శతకోటి - సారియందు
క్రతువాటి రిపుధాటి - కారియందు
భుజగేంద్ర ఘనసాంద్ర - భుజునియందు
రజనీంద్రరుంద్ర గో - త్రజునియందు

## ఉత్కళిక

భువియుఁ బవనంబు
దివియు భువనంబు
రుచులు నచరంబు
ఖచర నిచయంబు
నలరు బలుసొంపు
గలుగు చెలువంపు
ధరణి ధరునందు
బరమ గురునందు

## సంబోధన

ఉ॥ వాలిన నీ ప్రభావములు - వర్ణనసేయఁగ రావు కేలికిన్
శూలికిఁ దమ్మిచూలికిని - సోలికి నున్న సురాలికింప్రభా
మాలిక్కి నాకునెన్న వశ - మా యసమానగుణాఢ్య ధన్యగో
పాలక బాలకా నిగమభాషణ కీలక వేంకటేశ్వరా !

## కళిక

మఱియుఁ దలఁచగు సిరుల - మరుల కొనఁగెడు బాల !
కఱకు విఱినెఱి విఱుచు - ఘన జనకజామాత !

వెక్కసపు రక్కసుల - వేఁచి కాచినవాఁడ !
యుక్కఱఁగనక్కడలి - యుబ్బుగిబ్బినజేఁడ !
విదురుఁ డెదురుగఁ జేయు - విందుపొందులజాణ !
ముదుగు వెదురునఁ బాట - మూటగట్టిన గాణ !
లేటి శరకోటి నెడ - లించి త్రుంచిన రామ !
యేటి నాగేటఁ గది - యించి చించినరామ !

ఉత్కళిక

ఘనవనధియను పాదు
నను మునుఁబలుకుఁ బ్రోదు
లలర మొలచిన మొదలు
కలిమి చలువలఁబొదలు
ప్రమదసుమములఁ దొల్లి
యమరిన రమావల్లి
జెలఁగునో యెలఁ దేఁటి !
కలికి తనముల మేటి !

శా॥ నీ వీశుండవు నిన్నుఁగొల్తు వరముల్ నీచేతఁ గైకొందు నేఁ
గైవారంబొనరింతు నీ కొఱకు సంకల్పింప నీడేఱ వు
త్తేవల్ నీవలనన్ మహాయశము నిల్చెన్ నీకు నీయందు ల
క్ష్మీవాల్లభ్యము గంటి భక్తవరదా ! శ్రీవేంకటాద్రీశ్వరా !

ఉ॥ ఆరవితారకంబుగ ను - దాహరణంబు రచించె భక్తివి
స్తారతఁ దాళ్లపాకపుర - శాసనుఁ డన్నయ తిమ్మనార్యుఁడిం
పారఁగఁ జక్రనందక గ - దాంబుజధారికి శ్రీవధూమనో
హారికి, వేంకటాచల వి - హారికి, శౌరికి నంకితంబుగాన్.

మంగళమహా శ్రీశ్రీ జేయున్

శ్రీవేంకటేశోదాహరణము సమాప్తము.

గ్రంథసూచి :—

1. ప్రథమముద్రణము ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. 5 సం. 406-410 పుటలు

2. ద్వితీయ ,, తిరుమల శ్రీవేంకటేశ్వర పత్రిక.
Tirumala Sri Venk teswara Journal.
(February 1933) Vol. 1. No. 7.

3. తృతీయ ,, Minor works of Tallapakam Poets.
T. T. Devastanam series Vol. 1. 54-63 పుట
Edited with notes. (1935)

---

# శ్రీ హనుమోదాహరణము

## కవి :- చిత్రకవి పెద్దన

[హనుమోదాహరణమును రచించిన చిత్రకవి పెద్దన యాంధ్రలాక్షణికులలోఁ బ్రసిద్ధుఁడు - ఈతఁడు శుక్లయజుశ్శాఖీయుఁడు అనగా యాజ్ఞవల్క్యబ్రాహ్మణుఁడు - [1] కాత్యాయనసూత్రుఁడు. భారద్వాజ గోత్రుఁడు-తొలుత వీరి యింటిపేరు పార్నంచాల వారు. పెద్దననాఁటనుండియు చిత్రకవి వారైనారు. పార్నంచాల గ్రామనామము - చిత్రకవి బిరుదునామము - పెద్దన చిత్రకవితానైపుణ్యమున నిట్లు వ్యవహరింపఁబడుచుండుట నది క్రమముగా నింటిపేరైనది - పెద్దన కొడుకు, అనంతకవి. మనుమడు వేంకటరమణకవి. కవిలోకమున ప్రసిద్ధులే - వీరి వంశవృక్షమిది—




పెద్దన నివాసస్థలము స్పష్టముగాఁ దెలియరాలేదు. హనుమోదాహరణము లక్ష్యముగా నిచ్చిన లక్షణసారసంగ్రహములో 'నుతవెలలూరి పురీహనుమంతునకున్ (1-17) వెల్లలూరిహనుమన్మూర్తి (3-1) అని రెండు మాఱులు పేర్కొనఁబడియుంటచే నిది యే యాతని నివాసమని యూహించుట సమంజసము. వెలలూరు కడప

1. ఈతఁడార్వేలని యోగిబ్రాహ్మణుఁడని వీరేశలింగముగారి కవులచరిత్ర-ద్వితీయభాగమున (293 వ పుట) వ్రాయఁబడినది. కాని కవియే తన్నుఁగూర్చి చెప్పుకొనునపుడు 'శుభ కరశుక్ల యజుశ్శాఖికా ప్రభాసురుఁడ' అని (1-6) లో చెప్పుకొనుటచే నీవిషయమై సందేహమేలేదు.

జిల్లాలో గండికోట తాలూకాలో గలదు [1] తొలుత వీరియింటిపేరు పార్నంచాల వారుగదా! పార్నంచాల కర్నూలు జిల్లాలో నందికొట్కూరునకు నెనిమిది మైళ్ల దూరమునగలదు. కావున నీవంశీయులు తొలుత పార్నంచాలలోనుండి పెద్దన నాఁటికి వెలలూరి చేరుకొనియుందురు. తరువాత వీరివంశీయులకిదియే నివాసమయ్యెను. ఈతనికొడుకనంతకవి కడపమండలమున గల గండికోట దుర్గాధ్యక్షునిచే గౌరవింపఁబడుట నీయూహను బలపఱచుచున్నది.

పెద్దన క్రీ. శ. 1530-40 ప్రాంతములనున్న లాక్షణికుఁడై యాతఁడు, పేర్కొనిన కవులఁబట్టియు నాతనిఁబేర్కొనిన కవులఁబట్టియు నిరూపింపవచ్చును.

ఉ॥ త్ర్యక్షవర ప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
యక్షతభక్తి విస్ఫురదనంతు, ననంతు, కవిత్వలక్షణా
ధ్యక్షుఁ గాచిరాజు బసవార్యుని, భైరవు, నూత్నదండివా
గ్వీక్షణకర్ణనేతయగు వెల్లఁకితాతబుధేంద్రు నెన్నెదన్ (1-3).

పైని పేర్కొనిన వారిలో నూత్నదండికేతన - ఆంధ్రభాషా భూషణమను వ్యాకరణమురచించినను, ఛందోలక్షణ గ్రంథకర్తలతోఁ బాటు, తొలివ్యాకరణ కర్తకావున పెద్దన పేర్కొనినాఁడు. ఈతఁడు క్రీ. శ. 1250 ప్రాంతమువాఁడు. పైవారిలో కాలక్రమమునఁ గడపటివాఁడు వెల్లంకి తాతంభట్టు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడు. కావున నీతని పేర్కొనిన పెద్దన క్రీ. శ. 1500 లకు తరువాతి వాఁడనుట నిశ్చయమే.

పెద్దనను నప్పకవి (క్రీ. శ. 1656) పేర్కొనినను నంతకుముందు క్రీ. శ. 1560-70 ప్రాంతమువాఁడగు లింగమకుంట తిమ్మన సులక్షణసారములో నీతని నిట్లు పేర్కొనినాఁడు.

చ॥ అనుచునదే మొకో మునురయంబున లక్షణసారసంగ్రహం
బొనయవచించె చిత్రకవిపెద్దన తెన్నవు, [2] వోధువోధ్రుళ

---

1. Sewell—List of Antiquities-Page 260.
do. Vol. II Page 89.

2. పెద్దన తెలుఁగున సంస్కృతమున వోఢ, వోఢృ మొదలగు శబ్దము లుండవనియు, నవిఋచ్చులతోడనేగాని హల్లులతో నాదిని వ్రాయఁగూడదనియు నిట్లు చెప్పియున్నాఁడు.

గీ॥ ఆంధ్రసంస్కృత పదములయందు మొదలి
వైనఋలు ఓకారమనెడి లిపులు
స్వరములగు గాని హల్లులై చొరవు గనుక
వాకు నఃతోవ్యత్వముల నవి వ్రాయరాదు (3-8).

కాని సంస్కృతమున వోఢ, వోఢృశబ్దములు కోశములందుడుటచే తిమ్మకవి పెద్దనను విమర్శించినాఁడు, కాని యవి ప్రచారమున లేక పోవుటచే, పెద్దన యభిప్రాయము సరియైనదియే.

బ్బినయతఁ గానరో వినరో తత్ఘనుఁ డెంతయు ధన్యులయ్యు మే
ల్గనఁ బ్రభమఁ గాంతు రాత్మల నొకానొకచోటఁ బరాత్పరుఁ గ్రమ్మఁ గన్.

కావున పెద్దన 1530-40 (క్రీ శ) లో నున్నవాఁడని తేలుచున్నది. దీని బలపఱచుటకు వేఱొక సాధనము గలదు. పెద్దన తన్నుఁ గూర్చి చెప్పుకొన్న పద్యములో—

ధారుణీశ మాన్యుఁడను కందాళయప్ప
గారిశిష్యుండ - పెద్దఁ కవిన నండ 1-6).

అని గురువుగారినిఁ గూర్చి చెప్పినాఁడు. ఈ కందాళ అప్ప గారు (అణ్ణంగారు) కందాళయప్పగారి లేఁడ్రే వీరు సుప్రసిద్ధవైష్ణవాచార్య పురుషులై బహుమహాప్రబంధకర్తలగు నాంధ్రకవులచేఁ బొగడ్తఁ గాంచినవారు. అప్పగారు, 'ఆళవందారు' కందాళయప్పగారని పాండురంగ మహాత్మ్యమున ప్రస్తుతులు. చిత్రభారతమహా కృతిభర్త ఎనుములపల్లి పెద్దనామాత్యునకు, వైజయింతీ విలాసకృతికర్త సారంగు తమ్మయకు వీరుగురువులు, ప్రసిద్ధసంకీర్తనాచార్యుఁడు, తాళ్లపాక చిన్నన్న చేఁ బరమయోగివిలాసమునఁ బ్రస్తుతులు.

ఈ 'అప్ప' గారు క్రీ. శ. 1559 ప్రాంతమువారు. కందాళ అన్నగారిని పేర్కొను శాసనమే [1] క్రీ.శ. 1522 నాఁటిది, శ్రీతిరుపతి దేవస్థానమునఁ గలదు. కావున నీతని శిష్యుఁడగు పెద్దన 1530-40 ప్రాంతమువాఁడనుండుట సమంజసమే యగుచున్నది.

పెద్దన మానుమన్నభక్తుఁడు. ఈతఁడు రచించిన కృతులన్నియు నాతనికే యంకితము - ఈతఁడెన్ని కృతులు రచించెనో తెలియరాలేదు. చిన్నప్పు డీతఁ డొక శతకము రచించినట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క॥ మున్నొక శతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబు జేసితివిఁ కనున్
సన్నుతలక్షణ కృతియు
స్మన్నామాంకితము సేయుమా యిపుడనినన్. (1-9)

కాని యాశతకము లభ్యముకాలేదు.

పైని పేర్కొఁబడిన లక్షణకృతియే లక్షణసారసంగ్రహము.

లక్షణసార సంగ్రహము. [2]

తెనుఁగుభాషలో గల ఛందోగ్రంథములలో నిది యొక ప్రత్యేకవిశిష్టతఁ గలిగిన గ్రంథమని చెప్పనొప్పును. ఆంధ్రవాఙ్మయమున నంతకుమున్నే లాక్షణి

---

1. T. T. Devastanam Archaeological Report Page 217.

2. లక్షణసారసంగ్రహము. ఆంధ్రసాహిత్యపరిషత్తు. కాకినాడ - ప్రచురణము పీఠిక - నిడుదవోలు వేంకటరావు. ఎమ్. ఏ.

కులు గాని యాలంకారికులు గాని తమగ్రంథములలోఁ జెప్పనినాటకలక్షణముల నీకవి తెలిపియున్నాఁడు. ఇక ఛందస్సు విషయమున, నేఁటిదనుక నాంధ్రకవి పండితలోకమునఁ బ్రచురప్రచారమునను్న అప్పకవీయమున కిదిమూల మనిచెప్పినచో నీగ్రంథప్రాశస్త్యము తేటపడును. ఈ గ్రంథమున మూఁడాశ్వాసములు గలవు. ప్రథమాశ్వాసమున - అక్షరలక్షణంబును, గురులఘుసంజ్ఞలును, గణనిర్ణయంబును కావ్యస్వరూపంబును, కవిశిల్పస్వరూపంబును, అష్టాదశప్రాసభేదంబులును, సప్తవింశతియతి స్థితులును, ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబుల గలవృత్తసంఖ్యలలోఁ బ్రసిద్ధవృత్తలక్షణములునుంగలవు. ఇందు 01 పద్యములుగలవు. ద్వితీయాశ్వాసమున, వృత్తపద్ధతియు, దండకంబులను, ఆర్యాగీతులును కందంబుల చందంబును వానిభేదములును, అక్కరజాత్యాదులు, వైతాళీయములు పదవిశేషము లుదాహరణరగడ సీసపద్యలక్షణములు గలవు. 190 పద్యములు తృతీయాశ్వాసమున, రేఫఱకారనిర్ణయము, నాటకలక్షణము, చిత్రకవన ప్రశంసగలవు.

లక్షణసార సంగ్రహమునకు నప్పకవీయమునకు గలసంబంధముగూర్చి వివరించినచో నీగ్రంథమప్పకవీయమున కెంతమూలగ్రంథమైనదో తెలిసికొనవచ్చును.

1. కాలక్రమముననుసరించి తనకంటె పూర్వుఁడుగావున నీగ్రంథమును తొలుత గ్రంథావతారికయందు పేర్కొనినాఁడు. అప్పకవీయము 12 పుట.

2. ద్వితీయాశ్వాసమున రేఫాక్షరసీసమాలికయందు. "తాళ్లపాకాన్వయోదధిపూర్ణ ధవళదీధితి పెదతిరుమలదేశికుండు, మొదలైనవారలు మును రచించిన యవియెల్లఁ జాల వ్రాయనఁగవలదు."

ఈ మొదలైనవారిలోఁ జిత్రకవిపెద్దన యొకఁడు. లక్షణసార సంగ్రహమున 3 వ ఆశ్వాసమున సీసగీతములపట్టికనే యప్పకవి సీసమాలికగాఁ గూర్చినాఁడు. (ల. సా. సం. పుట 83-93) అప్పకవీయము (69-83).

3. అప్పకవీయమున యతులనుఁగూర్చి చెప్పినపుడు.

క॥ భీమనపది చెప్పెను నం
తామాత్యుఁడు చేసె వెనుక యతులిరువదినా
ల్గామీఁద కొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్.

ఇరువదియేడు యతులు చెప్పినవాఁడు పెద్దన-"యతులు తారావళిగఁ జేతుకృతుల లాక్షణికులుమెచ్చ" అనిచెప్పుటచే, అప్పకవి సూచించిన లాక్షణికుఁడితఁడే - మఱియు నీగ్రంథమునుండి యప్పకవి, దేశీయవిరతి, ఎక్కటివడికి నుదాహరణములుగా లక్షణసారసంగ్రహ పద్యములనే చేకొనినాఁడు.

4. ఈ క్రింది సంవాదములవలన, నప్పకవి యీ గ్రంథమునెట్లు పయోగించినో తెలియనగును.

పెద్దన—

ఉ॥ మాను నరోగముల్వెతలు మానును లేములు మానుమీకునో
మానవులార ! యూరక భ్రమంబున నేటికి నన్యదేవతా
ధీనులు గాక యెప్పుడు నతిస్థిరభక్తి దలిర్పఁగొల్వుఁడీ
మానిసుత ప్రసిద్ధమతిమంతుని మాహనుమంతునిన్ మదిన్.

అప్పకవి—మానవులార ! రోగములు మానును, లేములు లేవు సంపదల్
జానగు దుఃఖముల్ దొలఁగు జాలు నఘంబులు మందబుద్ధులై
దీనత నొంద నేఁటికి నతిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరు వసుదేవ కుమారకు ముక్తికోసమై.

పెద్దన—భవహరమౌను, పుట్టువును పావనమౌను, దరిద్రతావ్యథా
నివహములన్నియుం దొలఁగు నెమ్మది నెవ్వని పుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె చేకుఱు సత్క్రియాజిసం
భవహితదాసుచేత హనుమత్ప్రభుచేత నభీప్సితార్థముల్.

అప్పకవి—పులసిలనేల మానవుల పుట్టును పావనమౌను, నెప్పుడున్
కళవలమేల రోగముల కాలగతింగడకట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు దవ్వుల కేచను వాంఛితార్థముల్
గలుగు నమేయుచేత కమలాధవుచే, వటపత్రశాయిచేన్.]

పథమావిభక్తి

ఉ॥ శ్రీహనుమన్మహాకపి న - రేఙ్యుఁడు పుణ్యుఁ డగణ్యసద్గుణ
వ్యూహమనోజ్ఞభూషుఁడు స - మున్నత వాలధి జాతవాతసం
దోహనివారితాసుర ఘ - నుఁడు యశోధనుండు తే
జోహిమదీప్తి రాఘవభటాగ్రణి ప్రోచును మమ్ము సత్కృపన్.

కళిక - వృషభగతిరగడ

మఱియు దశరథరాజనందన
మంజుపాదసరోజభృంగము
కఱకుటసురల నిఱియెడు మదగజ
ఘటలఁ బొరిఁగొను కొదమ సింగము
బలిమి గరుడని తోడ నేరెడుఁ
బంటికై పెనఁగిన యుదారుఁడు
చెలఁగి యక్షునిఁ బట్టి చట్టలుఁ
చీరివైచిన సమరశూరుఁడు

దాసులకు ముంగొంగుపసిఁడి వి
ధమున వెలసినయార్తబాంధుఁడు
వాసవాదిసమస్తనిర్జర
వర్ణితామితసుగుణసింధుఁడు
ఎగిరి జలనిధి దాఁటి లంకిణి
నేపుమాపిన విక్రమాగ్రుఁడు
పగడములఁ జిగిఁ దెగడు మొగమునఁ
బరగుచుండెడు శుభసమగ్రుఁడు.

ఉత్కళిక

ఎదురు నసురుల కడుఁ జలంబునఁ
చదియఁ గొట్టి భుజాబలంబునఁ
జెఱికి మందుల గట్టు గొబ్బున
మెఱసి తఱితోఁ దెచ్చియుబ్బున
కడిమి నని దశకంఠుఁ జేసినఁ
బడినలక్ష్మణు బ్రదుకఁ జేసిన
వీరవానర సార్వభౌముఁడు
ధీరకైరవపూర్ణసోముఁడు.

ద్వితీయావిభక్తి

ఉ॥ మానును రోగముల్ వెతలు - మానును లేములుమాను మీకు నో
మానవులార! ఊరక భ్ర - మంగొననేఁటికి నన్యదేవతా
ధీనులు గాక యెప్పుడు న - తిస్థిరభక్తిఁ దలిర్పఁ గొల్వుఁడీ
మానినుతప్రసిద్ధమతిమంతుని నా హనుమంతుని న్మదిన్.

కళిక - ద్విరదగతిరగడ

మఱియు భీమాకార - మకరిఁ గొట్టినవాని
మెఱసి రణమునఁ బెరిగి - మిన్నుముట్టినవానిఁ
బేరుగలరక్కసుల - వీఁచమడఁచినవాని
వారాశి మున్నూఱు - వడిని గడచినవాని

బ్రహ్మాస్త్ర బంధంబుఁ - బాయఁ ద్రెంచినవాని
బ్రహ్మపట్టంబునకు - భావముంచినవాని
నిలభాగవతులందు - నెన్నఁ జాలినవానిఁ
గలితధృతి వేలుపుల గట్టుఁ - బోలినవాని

ఉత్కళిక

భీమగతిఁ బాతాళ
హోమమొనరుచు వేళ
మబ్బుదిరుగుడుతేని
యుబ్బుచెదరఁగ బూని
సంచలించుచు బొబ్బ
రించఁగా నొకదెబ్బ
వేసియార్చినవాని
వాసిఁ బేర్చినవాని

తృతీయావిభక్తి

చ॥ భవహరమాను, పుట్టువును పావనమాను దరిద్రతావ్యథా
నివహములన్నియుం దొలఁగు నెమ్మదినెవ్వని పుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె చేకుఱు నట్టియాజినం
భవహితదాసుచేత హనుమత్ప్రభుచేత నభీప్సితార్థముల్.

కళిక - తురగవల్గనరగడ

మఱియు సురసమాయఁ గెలిచి
మహిమబాఱియు యోగిచేతఁ
బెఱికి రావణునిమనంబు
వెంపువఱచు వేగిచేతి
గట్టిగాఁగఁ బసిఁడిముంజి
గట్టుకొన్న వటునిచేతఁ
జట్టురాతినాతిఁ జేయఁ
జాలినతని భటునిచేత
రవిజుఁదెచ్చి వంపయొద్ద

రాముఁగూర్చు ఘనుని చేతఁ
జవుటికడలి దాఁటినట్టి
జవవిశాలధనుని చేత
మఱవ కెపుడు దాసజనుల
మనుచు మునివిధేయు చేత
నెఱుక మెఱసి వరములిచ్చి
యెసఁగునాంజనేయు చేత.

ఉత్కళిక

మొదలి చదువుజాగిలములు
పొదలి సోఁకుబంటుగములు
కొలిచి రాఁగ సలుగునేసి
నిలిచి మించు చెంచుడాసి
పోరిలోన గెలువఁ జాలు
వీరుఁడైనవాని డాలు
నందునున్న వేల్పుచేత
మందరాగకల్పుచేత

చతుర్థీ విభక్తి

ఉ॥ చాటుమహాప్రబంధముల జాడలు లక్షణవేత్తలౌనన్
సూటిగవిన్న వీనులకు సొంపుగ నేనిటు కావ్యముల్ మహా
నాటకముఖ్యకావ్యములలో సర్చినయట్టి మునీషికై మహీ
జాటకులాబ్జభాస్కరునికై హనుమత్ప్రభుకై యొనర్చెదన్.

చతుర్థీవిభక్తి - కళిక - హరిణగతిరగడ

మఱియును బంగరుజందెము ముంజిక
మండలు దండము గల పుణ్యునకై
మెఱయఁగ సుగ్రీవాంగదులౌనన
మెలఁగెడు కపిలోకవరేణ్యునకై

తొలువేలుపుఁ దపసిని నొకపిడికిట
దునియఁగఁ బొడిచిన బలుమల్లునకై
వెలసిన వెను రాకాసి మెకమ్ముల
వేఁటాడెడు భీకర భిల్లునకై
రహిఁగల సద్గుణమహిమనుఁ బొలుపగు
రామాయణమహోజ్జ్వలమణికై
మహిదుహితృమనోవల్లభ దాస స
మంచితధీవరకై రవ ఘృణికై
బళిరా యనబలు తాయి కరంగఁగఁ
బాడిన గాన కళాలోలునకై
సలలిత సుకృత ఫలంబున కేసరి సతి
గాంచిన ముద్దులబాలునకై

ఉత్కళిక

వేసర కిర్వది చేతుల నలకై
లాసము నెత్తిన బలు దొరపురికై
పనిలసఖుం డాహుతిఁగాఁ గొనికై
కొనఁగాఁ జేసి ప్రతాపమహాకై
రవ రిపు నెసగించుచు మాయాకై
తవబలులగు దనుజుల మదయుతకై
టభ నిభులను దునిమిన శూరునకై
శుభములు నతులకునిడు ధీరునకై

పంచమీవిభక్తి

ఉ॥ ఏ యెడనైన వైష్ణవజ - నే తిరులన్ భజియింపఁబోక మా
రాయత బుద్ధు తో మనుజు - లార భజించిన మాత్రగొబ్బున
న్నాయని లాత్మసూనువల - నన్ రఘువంశజ రామధారుణీ
నాయక కార్యకర్తవల నన్ విడఁ జాలును కర్మబంధముల్ -

కళిక - ద్విరదగతిరగడ

మఱియు సూర్యకుమార - మంత్రి కుంజరువలన
మఱలు నతజన వార - వజ్రపంజరువలన
సవినయస్థితిఁ బొల్చు - సత్యసంధునివలన
భవదోషపటు తిమిర - పద్మ బంధునివలన
విజితేంద్రియత్వమున - వెలయు జయధనివలన
నజముఖ్య సురవినుత - హరిగుణ ఖనివలన
భీమాజి నిశ్శంక బిరు - దోద్ధురుని వలనఁ
దామ సాకృతి దైత్య - తతి భీకరునివలన

ఉత్కళిక

రామతలిఘుప్రసాద
మోమితీసుక మోద
గతిఁ జెందఁగానిందు
మతిడెబ్బదియు రెండు
వెల్వాలకు నేమించి
తెల్విమీఱఁగఁబంచి
(యొసగుమాన్యునివలన ఎసగుధన్యునివలన)

షష్ఠీవిభక్తి

ఉ॥ దొంతులుగా మహాగిరులు - తోరముఁగల్గినతోఁకచుట్టుపై
వింతవహింపఁ జేర్చి విను - వీథిని మబ్బున గొబ్బు గొబ్బునన్
బంతముమీఱఁ గట్టుకును బల్మియుఁ దెచ్చినయట్టి యానఘ
స్వాతునిఁ బట్టికిన్ ప్లవగ - చంద్రునకెవ్వరుసాటి లావునన్.

కళిక - తురగవల్గన రగడ

మఱియు జెఱకు రామనామ - మానవేన సేవకునకుఁ
దఱచు మెఱచు నతువృత్తు - దారుణోరుపాపకునకుఁ
జెలువు నలువుగలిగి మెలఁగు - క్షిప్రతాప్రభంజనునకుఁ
జలము బలము నెన్నఁగన్న - సాధుయూధరంజనునకు

ధీరశూరపాళి పాలి - దేవతావనజమునకు
భూరివారిజాప్త దీప్తిఁ - బొల్చునిల్చు తేజమునకుఁ
గేలమేలిఫలములలరు - కీశ ఖేశ భూమణునకుఁ
జాలవాలమూఁచి చాచు - శత్రు గోత్ర భీమణునకు.

ఉత్కళిక

రాముచే మెఱుంగెసంగ
భూమసమ్మైవెలుంగుమంగ
రమిడి చిముడుసీత చేత
మమరసమరరీతి చేతఁ
గినుకఁజెనకి చుట్టిపట్టి
దనుజతనుజుఁగొట్టినట్టి
దళితలలితవనకులునకు
గిళితకలితదినకరునకు.

సప్తమివిభక్తి

శా॥ నందిగ్రామపురంబునన్ భరతుఁడుండన్ ముందుగావచ్చి యా
మం దేవారి కులాబ్ధిచంద్రునకు రామక్షేమవృత్తాంతముల్
విందుల్ సేసిన పుణ్యునందు దితిభూ విధ్వంసి యుందున్ సుధీ
బృందారాధితపాదునందు నిలిచెన్ శ్రీమత్ప్రతాపోన్నతుల్.

కళిక - హంసగతి

మఱియు నుతికెక్కు శ్రీ - మంతునందు
జరపక వరంబు లిడు - శాంతునందు
భావసేవితరామ - భద్రునందు
రావణముఖాసహ్య - రౌద్రునందు
ప్రకటితాచారసంపన్ను నందు
సకలహిత సాధుప్ర - సన్ను నందు
స్వామిహిత కార్య ని - ర్వాహునందు
సామాదినయ సమ - త్సాహునందు.

### సప్తమీవిభక్తి - ఉత్కళిక

పవనవేగంబు
వివిధయోగంబు
ప్రచురశౌర్యంబు
నచలధైర్యంబు
చారువిస్ఫూర్తి
భూరిసత్కీర్తి
గలసుకృతియందు
వెలయు ప్రతియందు

### సంబోధన

ఉ॥ భీమమహాసురులం గెలిచి పెద్దతికంబొనరింపు మంచు శ్రీ
రాముఁడు మెచ్చియిచ్చిన విరాజితబంధురతారహారమా
భూమిజఁ దెచ్చి కంఠమున బూన్చిన చెల్వువహించు నాఁటినీ
శ్రీ మహితాకృతిం దలఁతు చిత్తమునం బవమాననందనా !

### కళిక - ద్విరదగతిరగడ

మఱియు ఛాయాగ్రాహి - మదమడంచిన వీర !
నెఱయు పరమధ్యాన - నిష్ఠాసదాచార !
భావివేళాబ్రహ్మ - పట్టోచితాకార !
గ్రావసమధృతిఁ గల్గు - గంధవాహకుమార !
గళితశాత్రవదైత్య - కామినీతాటంక !
కలితలంకాపురీ - గ్రావ భేదనటంక !
ధూమ్రమాతృహరణైక - దోశ్శక్తి బిరుదాంక !
కమ్రప్రతాపఘన - కాంతిజితధూమాంక !

### ఉత్కళిక

అనిరామలక్ష్మణులఁ
గొనిడాచుదుర్గుణుల

నలరసాతలలంకఁ
గలచి త్రుంచి కడంకఁ
బుడమి కారాఘవుల
వడిఁ దెచ్చి కడుమివుల
వెలయు దీనశరణ్యా !
యఘుపుణ్యాశరణ్యా !

## సార్వవిభక్తికము

శా॥ నీవాద్యుండవు, నిన్ను గొల్తు నెపుడున్ నీ చేత శ్రీమించె నీ
కై వే మ్రొక్కులొనర్తు నీవలన నిష్టార్థంబు సంధిల్లె నీ
కే వైరుల్ భయమందకుండ్రు మదినూహింపంగ నీయందు శౌ
ర్యావిర్భావ జయంబులెచ్చెను జగత్ప్రాణోద్భవా ! ధీనిధీ !

## అంకితాంకపద్యము

ఉ॥ లక్షణసారసంగ్రహమి - శక్కలనామతి సన్నుతోపమో
త్ప్రేక్షలఁ మీఱఁ జిత్రకవి - పెద్దన యర్పణచేసె మీకు నో
యక్షయ శౌర్య యీ భవదుదాహరణంబు జగత్ప్రసిద్ధియై
యీ క్షితి మించఁ జేయుము మహీతనయాధిపపాదసేవకా !

గ్రంథసూచిక:—

లక్షణసార సంగ్రహము - ముద్రణము 1937. ఆంధ్ర సాహిత్య పరిషత్తు. కాకినాడ. పీఠికా కర్త సంస్కర్త. ని. వేంకటరావు ఎమ్. ఏ

## ఉదాహరణ సూచనము

నిస్పృహాశయకవితాధురంధరుఁడగు బైచరాజు వేంకటనాథకవి (రాజకవి) తన పంచతంత్రములో (4-121).

చ॥ సరసగభీర శబ్దఘనపారసమృద్ధిఁ బ్రసిద్ధిగన్నయా
సరసులఁగూడి చారుగతి సద్వ్రతతుల్ భజియింప పాదవి
స్ఫురణఘటింపుచున్ దొడుసుపుట్టక యుజ్జ్వలధారచే నుదా
హరణము చేయుచున్నకవి నారసిచూడు మరాళగామినీ!

ఇందు శ్లేషగా నుదాహరణ లక్షణముగలదు. కవి - కావ్యము చేయువాఁడు ; నీటిపక్షి—

గభీరశబ్దములు; చారుగతి; పాదవిస్ఫురణ - ఉజ్జ్వలధార యిరువురికి సమానములు.

మఱియు తృతీయాశ్వాసమున వసంతవర్ణన చేయునపుడును నుదాహరణము స్మరించినాఁడు.

"మఱియు నవ్వసంతంబు కళికాభిరామంబై యుదాహరణంబును శుకసూక్తి సందర్భగర్భితంబై భాగవతంబును (3-144).

గ్రంథసూచిక:—

పంచతంత్రము—తొలిముద్రణము 1874 బ్రహ్మశ్రీకొక్కొండ వేంకటరత్నము పంతులుగారిచే పరిష్కృతము.

పంచతంత్రము—వావిళ్లముద్రణము 1924.

పంచతంత్రము—తాళపత్రప్రతి 10-1-10 మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాల.

---

## ఉదాహరణలక్షణము - మూర్తికవి

నరసభూపాలీయమున మూర్తికవి కావ్యస్వరూపములను చెప్పు సందర్భమున మహాకావ్యలక్షణము చెప్పి—

"ఇందునొక కొన్నికడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్యమనఁగ బరగు
మఱియు క్షుద్రప్రబంధ నిర్మాణమర్మ
లక్షణము లేర్పఱించెద లలితఫణితి."

—2 ఆ. 168 పద్యము.

అని యుదాహరణ లక్షణము చెప్పినాఁడు.

క్షుద్రప్రబంధము :—

కం॥ కలికోత్కలికలు పద్యము
లలరారు విభక్తులుం దదాభాసయుతో
త్కలికలు సజయతిపదమా
నలమానిని మొదలఁదగ నుదాహరణమగున్.

—2 ఆ. 169 పద్యము.

కం॥ అందు విభక్త్యాభాసము
లందుఁ జతుర్థికిని తెనుఁ గుదాహరణము పెం
పొందం గలికోత్కలికల
సందీప్త విభక్తితాల సప్రాసంబై.

(నరసభూపాలీయము లేక కావ్యాలంకార సంగ్రహము ముద్రణము 1883 బహుజనపల్లి సీతారామాచార్యులవారి సంస్కరణము 48 పుట.)

---

## ఉదాహరణ సూచనము

అయ్యలరాజు రామభద్రకవి, తనరామాభ్యుదయ కావ్యములో శ్లేషగా నుదాహరణ లక్షణమును చెప్పినాఁడు. ఇది వసంత వర్ణనమున పొందుపడినది.

కం॥ తలప నుదాహరణాకృతిఁ
కళికల రంజిల్లి సరసకవి కావ్యమునుం
బలె నెడల మత్తకోకిల
కలనన్మధువేళ మధునికాయంబలరెన్.

—1 వ ఆశ్వాసము.

ఇట - కలికలు - మొగ్గలు - శ్లేషలో కావ్యభేదము పేర్కొన్నాఁడు.

రామాభ్యుదయము వివేకవర్ధనీ ముద్రాక్షరశాల రాజమహేంద్రవరము 1895.

తాళపత్రప్రతి సంఖ్య 236 తంజావూరి పుస్తకభాండాగారము.

,, 716 717. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాల.

# హరిహర శ్లేషోదాహరణము

## చిత్రకవి అనంతకవి క్రీ.శ. 1580

లక్షణసార సంగ్రహకర్తయగు చిత్రకవి పెద్దనపుత్త్రుఁడగు ననంతకవి హరిహర శ్లేషోదాహరణమను నుదాహరణము రచియించి నట్లాతని పుత్రుఁడగు చిత్రకవి వేంకటరమణకవి తన 'సాంబవిలాస' గద్యలోనిట్లు వ్రాసియున్నాఁడు.

"ఇది శ్రీహనుమత్ప్రసాద లబ్ధసార సారస్వతపాత్ర, భారద్వాజగోత్రపవిత్ర, ప్రథమశాఖావంశ సంభవసముజ్జ్వల కాత్యాయన సూత్ర లక్షణసారసంగ్రహ రచనా విశారద చిత్రకవి పెద్దనార్య పౌత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యాన, వ్యాఖ్యాన, హరిహర శ్లేషోదాహరణ సకలజీవ సంజీవనప్రబంధ బంధుర వంశావళి సృజనాధురంధర అనంత సత్కవీంద్రపుత్ర, దయాదాక్షిణ్యాదిక సమస్త సద్గుణ కదంబాంబా సమానాబళాంబా గర్భక్షీరవారాశి కుముదబాంధవ చరిత్ర, శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాంజనేయాంకన మంజుల త్రిలోకసంజీవ న్యభిఖ్యన్యవిలాస, సకలవర్ణనాపూర్ణ రామాయణ కుమారగురువిలాసాదిక దివ్యకావ్యకరణాతిధురీణ శేముషీవిశేషణ రాఘవ పాండవీయ, విష్ణుచిత్తీయ, వసుచరిత్ర ప్రముఖదివ్య కావ్యార్థ బోధన సమర్థహృదయకమల విద్వత్కవీంద్రవిధేయ వేంకటేశ్వర నామ వేంకటరమణ కవీశ్వరవిరచితంబైన సాంబవిలాసంబను మహా ప్రబంధంబునఁ బ్రథమాశ్వాసము."

(అముద్రితము సాంబవిలాసము సంఖ్య 123 బి మదరాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము).

చిత్రకవి యనంతరచితమైన యుదాహరణము లభింపలేదు. ఇట్లే యితని సకలజీవసంజీవని, వంశావళి గ్రంథములు లభింపలేదు. ఇతని హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యానము చాలప్రసిద్ధమైనది.

ఈ వ్యాఖ్యతోడనే హరిశ్చంద్ర నలోపాఖ్యానము మొదట క్రీ.శ. 1896 లో అముద్రితగ్రంథ చింతామణి పత్రిక యందు ముద్రితమైనది. ఆ వెనుక క్రీ శ. 1918 లో బ్రహ్మశ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారి దీవ్యత్పీఠికతోఁగూడ 'వావిళ్ల' వారిచేఁ బ్రకటితమైనది.

చిత్రకవియనంతకవి గండికోటను పాలించిన పెమ్మసాని చిన తిమ్మానాయనికాలమున నున్నకవి. ఈ విషయమీతని హరిశ్చంద్ర నలోపాఖ్యానవ్యాఖ్యనుండి యిట్లు తెలియుచున్నది.

సీ॥ శ్రీహనూమద్వర శ్రీలబ్ధసుకవిత్వ
చతురుండ లక్షణసారసంగ్ర
హంబొనర్చి యుదృత్కీర్తిఁ బ్రఖ్యాతుఁ
డగుచిత్రకవి పెద్దనార్యసుతుఁడ
విష్ణుచిత్తీయాది వివిధకావ్యార్థముల్
దెలిసివక్కాణించు ధీరతముఁడ
గండికోటాఖ్యదు ర్గస్థలాధ్యక్షుఁడై
పృథివినుతికెక్కు పెమ్మసాని

చిన్న తిమ్మక్షమాపాల శేఖరుండు
గారవింపఁగ బహుమాన గౌరవమున
మనిన ధన్యుండ సర్వసమ్మతగుణైక
గరిమ వెలయు ననంతాఖ్యకవివరుండ.

తాడిపత్రి కైఫీయతునందు గండికోట చిన తిమ్మానాయడు. క్రీ.శ. 1578, 85, 1593 ప్రాంతముల నీతడు విలసిల్లినట్లు, దానశాసనములు గలవు. కావున చిత్రకవి అనంతకవి క్రీ.శ. 1580 ప్రాంతమువాఁడు.

# శ్రీ కృష్ణోదాహరణము

కవి:- కాకునూరి అప్పకవి

["ఈతనికాలము యీ గ్రంథములోని పీఠిక 33 వ పద్యమునుబట్టి శాలి-శ. 1578 మన్మథనామసం॥ శ్రావణ బ॥ 8 నాడు (అనగా క్రీ.శ. 1656. సం॥ఆగస్టు 3 తేదిని తనకు కలవచ్చినట్లు కవి చెప్పుకొనుటచేత, 17 వ శతాబ్దమధ్యమం దుండినవాడని స్పష్టముగా కనబడుచున్నది. కలగన్నమరునాడే ఈ లక్షణగ్రంథమును వ్రాయుటకు మొదలుపెట్టుటచేతను, తానిదివరకు సంస్కృతాంధ్రగ్రంథములు రచించినట్లును్ను శ్రీగిరిలో భోగవిభూషణుని పట్టపు కవీంద్రుఁడుగా ఉన్నట్లును్ను పీఠిక (84,85)లో చెప్పుకొనుటచేతను, అప్పకవి 17-వ శతాబ్దారంభమున పుట్టియుండునని ఊహింపవచ్చును. అప్పకవీయము "క్రీస్తుశకము 1656-వ సంవత్సరమునం దారంభింపబడి 1660-వ సంవత్సర ప్రారంభమున కింతవరకుఁ జేయఁబడియుండును." అని వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవులచరిత్రలో వ్రాసినారు. గాని క్రిందగీటు గల వాక్యములోని విషయమునకు ప్రమాణము ఎక్కడనున్నదో మాకు తెలియదు.

## వంశావళి

కర్తృవంశావతార పద్యములబట్టి (పీఠిక 70-83) అప్పకవి భరద్వాజగోత్రుడనిన్ని, పండితవంశమునందు పుట్టినవాడనిన్ని స్పష్టమగుచున్నది. ఈ దిగువ కనబఱచిన వంశవృక్షమునకు ఆ పద్యములే ఆధారము.

కాకునూరి తిమ్మన




* (ఓ) లో "లక్ష్మణాఖ్యబాలబుచ్చి" (పే. 83) అని ఉండుటచేత ఈ పేరునూ చేర్చినాము ప. లోని "బాలుగాంచె" అనేపాఠము మూలమందుంచినాము.

'కాకునూరు' అని తనఇంటిపేరు వచ్చుటకు కారణము పే. 72 లో చెప్పుకొన్నాడు. అతని తాతకు తాతయైన సోమయ మధురాపురమునకుపోయి "వేద శాస్త్రపురాణాదివాదములను కాకునూరింటఁజేసినకారణమున కాకునూరింటివాడను ఘనతగాంచె" నని ఉన్నది. అయితే, దాని తర్వాతిపద్య మందే అతడు చరిగొండ సీమలో కాకునూరు అనే సర్వాగ్రహారము సంపాదించినాడని చెప్పుట చేత, ఈఇంటిపేరు గ్రామనామమా లేక పౌరుషనామమా అన్నసందేహము పుట్టుచున్నది. ఆ సోమయ కాకునూరి తిమ్మన సుతుండు (పే. 73) అనిచెప్పుటచేత అతని తండ్రినాటికే ఈ ఇంటిపేరు ఉన్నట్లు ఊహించుటకు అవకాశమున్నది. లేదా కొడుకు సంపాదించిన పేరు తండ్రికి పెట్టినాడని చెప్పవలెను.

సోమయ "అభినవచూతసద్గ్రామము" లో ఉండినట్లు పే. 73-వ పద్యముబట్టి తెలియుచున్నది. ఈగ్రామముపేరు 'కొత్తమామిడిపల్లె' అయిఉండును. "మామిళ్ళపల్లె యొకటి బాపట్లతాలూకాలో నున్నది. మామిళ్ళపల్లి (అగ్రహారము) యొకటి నూజివీడు తాలూకాలో నున్నది" అని లక్ష్మణరావుగారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములో వ్రాసినారు.

అప్పకవితాత పెద్దసోమయ్య రొంపిచెర్లలో పెద్దనూయి త్రవ్వించి నాడనిన్ని, గుడిపాటిలో వినుకొండ మార్గమందు పెద్దతోట వేయించినాడనిన్ని పే. 79-వ పద్యమందున్నది. రొంపిచెర్ల నరసారావుపేటలో యున్నది. "సత్తెనపల్లి తాలూకాలో గుడిపూడి యను పల్లెయున్నది" అని లక్ష్మణరావుగారు వ్రాసినారు.

అప్పకవితండ్రి వెంగన పల్నాటిలో తనపాండిత్యవిశేషముచేత "మాఊట బ్రహ్మ" అనేపేరు పొందినాడని పే. 82 లో యున్నది.

పెద్దసోమయభార్య కృష్ణమ్మ. ఈమెతండ్రి వట్టెముపోతన (పే. 80) వెంగన భార్యసేసమ (శేషమ్మ); ఈమెతండ్రి కృష్ణమ్మసోదరుడైన పెద్దభట్టుఅవునో కాదో స్పష్టముగా తెలియదుగాని, అయివుండునని ఊహించుట కవకాశమున్నది. అప్పకవి కామెపల్లిలో ఉండగా స్వప్నము వచ్చినట్లును అది అక్కడి మాతృసంబంధులు విన్నట్లును కవిచెప్పుకొనిఉన్నాడు (పే. 66) వట్టెమువారిది కామెపల్లిగనుక, ఆ మాతృసంబంధులు వట్టెమువారే అయిఉండవచ్చును.

లక్ష్మణరావుగారు ఊహించినట్లు "అప్పకవి మేనమామల యింటింలోనే పెరిగి విద్యావంతుడయ్యెనని కూడ లోకవార్తవచ్చుచున్నది. కావున నతనికుటుంబము మేనమామలబట్టియే కామెపల్లికి వచ్చెనని మనము నిశ్చయింపవచ్చును."

ఈ కామెపల్లి కొండవీటికి పడమటను శ్రీశైలమునకు ఈశాన్యమునందును గల తంగెడుసీమలో ఉండెను. "కామెపల్లి యిప్పుడు గుంటూరుజిల్లాయందలి పల్నాడుతాలూకాలో యున్నది. అప్పకవికాలమున నది తంగెడుసీమలోనిది.

ఇప్పుడు తంగెడు అను గ్రామము కామెపల్లికి పశ్చిమమున పల్నాడుతాలూకాలో యున్నది" అని లక్ష్మణరావుగారు వ్రాసినారు.

ఈ కామెపల్లి (vi. 1) ఏలేశ్వరమునకు తూర్పున ఏడు యోజనములు దూరముగాను, శేతవరమునకు (v. 1) నైరృతిదిక్కున మూడుయోజనములు దూరముగాను, "సహ్యజాదక్షిణైకయోజననివేశే" (v 172) అనుటచేత కృష్ణకుదక్షిణమున ఒకయోజనముదూరముగాను ఉన్నట్లు తెలియుచున్నది.

అప్పకవికి నివాస్థానమయిన కామెపల్లి యిప్పుడు లేదని శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు చెప్పినారు.

## వంశోత్కర్ష

అప్పకవి పండితవంశమునందు జన్మించినాడు. అతని తాతకుతాతయైన సోమయ కాశిలో బ్రహ్మేంద్రులవద్ద శాస్త్రములు చదివి గొప్పపండితుడై ఉండెను. మధురాపురమందు పండితులతో శాస్త్రవాదములు చేసిగెలిచినాడు. (పీ. 72, 73) అప్పకవితాతయైన పెదసోమయ క్రతువులుచేసినవాడు. (పీ. 78) ఈ పెదసోమయకు అగ్రజుడైన తిరుమలభట్టు కాలామృతము అనే జ్యోతిష గ్రంథము రచించినవాడు. (iv. 67) అప్పకవితండ్రి వెంకన తన పాండిత్యవిశేషముచేత "మాఱటబ్రహ్మ" అని ప్రఖ్యాతిపొందినవాడు (పీ. 82). ఈ లక్షణగ్రంథము (అప్పకవీయము) రచించకమునుపే, అప్పకవి శ్రీశైలములో 'భోగవిభూషణుని పట్టపుకవీంద్రు" డయి ఉండెను. (పీ. 84) సంస్కృతాంధ్రగ్రంథములు కొన్నిరచించెను. (పీఠిక 85) వీటిలో మనకొక్కటైనా లభించకుండుట కడుశోచనీయము. "అంబికావాదమను యక్షయగానమునైతము" పేర్కొనుటచేతను, యక్షగానముల గురించి ఈగ్రంథములో నాలుగవ ఆశ్వాసమందు వ్రాసిఉండుట చేతను యక్షగాన ప్రబంధమునకు ఆకాలమున తగిన గౌరవముండెనని ఊహింపవచ్చు. !!]

(అప్పకవీయపీఠిక. రావుసాహెబు కీ. శే. గిడుగు రామమూర్తిపంతులుగారు. వారి తనయులు సీతాపతిగారు పుటలు. 3-7). వావిళ్ళముద్రణము. 1924.

## ప్రథమావిభక్తి

ఉ॥ శ్రీవనితాసనాథుఁడు వశీకృతభక్తమనోంబుజుండు, వి
శ్వావసుఁడుగ్రసేనుఁ డురువైద్యుఁడ జేయుఁ డగణ్యసద్గుణా
ప్రావృతభూషణోజ్జ్వలుఁ డహఃపతికోటిమరీచిభద్రదం
తావళనాయకావనుఁ డుదారుఁడు కృష్ణుఁడు మమ్ముఁబ్రోవుతన్.

క ళి క

మఱియు దేవకిశౌరసేనికు - మారనిర్మల రత్నరాజము
కఱకు టసురుల నెల్లఁ దారుణ - కదనధారుణి దునుము తేజము
బలిమి నందనవనములోఁ బలి - పారిజాతము ధరకుఁ దెచ్చెను
కోలఁదిమీఱిన సమ్మదంబునఁ - గుండలంబులు తల్లికిచ్చెను
చెలఁగి నరునకు సూతకృత్యము - జేసి కౌరవులఁ బరిమార్చెను
తలపు మఱువని దాసచయములఁ - దవిలి తిరుగని ముక్తిఁ జేర్చెను
వెలఁదికోఱకును బాణుచేతులు - వేయునఱికిన విక్రమోగ్రుఁడు
జలదముల జిగిఁదెగడునొడలున - జానుమీఱెడు శుభసమగ్రుఁడు

ఉత్కళిక

కమలనేత్రుని రాక రోయుచు
యమునయొడ్డున తపముసేయుచు
నున్న కాంతనుఁ జూచి రయమున
నున్నసుద్దివచించి ప్రియమున
నరుఁడుగూర్చిన మిత్రునానతి
కరముబట్టెడు దానిఁ దానతి
విదళితాసురసార్వభౌముఁడు
యదుకులాంబుధి పూర్ణసోముఁడు

ద్వితీయావిభక్తి

ఉ॥ మానవులార! రోగములు - మానును, లేములు లేవు, సంపదల్
జానగు దుఃఖముల్దొలఁగు - జాఱునఘంబులు మందబుద్ధులై
దీనతనొందనేఁటికి న - తిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరు వసు - దేవకుమారకు ముక్తికోసమై.

క ళి క

మఱియు ప్రేతలనెల్ల - మరులు కొల్పినవాని
మెఱసి కానను బసుల - మేపి తిరిగెడు వాని
భామతో దూర్వాసు - బండియాడ్చినవాని

వేమఱెదిరిన మగధు - విఱుగఁ ద్రోచినవాని
బాలుఁడై ఆలెక్క - పాలు ద్రావిన వాని
హేలతోఁ బదిరూపు - లెలమిఁదాల్చినవాని
తాళవృక్షములెల్ల - ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ - గాలఁ దన్నినవాని
లీలఁగొల్తును గడిఁది - లేమిఁబాపెడువాని

ఉత్కళిక

ముందు పావకుఁగొల్చి
ఖాండవాహుతిఁద్రేల్చి
పార్థివేశ్వరుఁ గాంచి
పార్థునక్కడ నుంచి
దారకుండమరించి
చేరఁదెచ్చినమంచి
యరదమెక్కక పూని
పురికి వచ్చినవాని

తృతీయావిభక్తి

చ॥ పులసిలనేల మానవుల - పుట్టును పావనమయ్యె నెప్పుడున్
గళవళమేల రోగము ల - కాలగతిం గడవట్టు నీతి బా
ధలును దరిద్రతావ్యథలు - దవ్వులకేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేత కమ - లాధవుచే వటపత్రశాయిచేన్.

కళిక

మఱియు బ్రహ్మమాయఁగెల్చి - మసలు మంత్రవాదిచేత
నెఱిఁగి సాంభకునకు వరము - లిచ్చి మెఱయు మోదిచేత
మృతతనయుని మరల గురున - కిచ్చినట్టి యమృతుచేత
నతుల రాసకేళిసలిపి - నట్టి యాదినటుని చేతఁ
బిండిరుబ్బునాతిమోము - పెరుగు దుడుచు కొంటెచేత
మండుచున్నకారుచిచ్చు - మరగిత్రావు నమరుచేత

నెలుఁగుతోడఁ బోరిమణియు - నింతిఁగొనిన యజుగుచేత
వెలయఁ దులసిపూసపేరు - వేసికొనిన జోగిచేత.

ఉత్కళిక

గట్టిగళరపంజరంబు
గట్టఁదలఁచి వేగిరంబు
చపుటికడలి చెంతఁజేరి
పవనతినయుతోడఁబోరి
తన్నుఁ జీరినంత వచ్చి
చెన్నుగెలుపు నరునకిచ్చి
మహిమమెఱయు కృష్ణుచేత
మిహిరకోటి దీప్తిచేత.

చతుర్థీ విభక్తి

శా॥ ఓలంబాసకుఁ దేకమత్సరముతో - నుప్పొంగి పెక్కేడులా
భీలాకారమునన్ గొలంకునడుమన్ - బేటాడునక్రంబుతోఁ
జాలంగయ్యము చేసి చిక్కిన మద - స్తంబేరస్వామికై
కేలంబట్టి నిమిర్చినట్టి హరికై - కృష్ణాంబు భృన్మూర్తికై

చతుర్థీవిభక్తి - కళిక

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము
మణియును శంఖముఁబట్టిన హరికై
మెఱయఁగ విద్యుచ్ఛేలముఁ దాల్చిన
మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై
వెలుచంగదిసిన మల్లులనిరువురఁ
బిడికిటఁబొడిచిన బలుమల్లునకై
వెలయఁగ యమునానదిలోఁగాళియు
విషధరుఁద్రోలిన యదుసింహునకై
విజయుని రథసారథియై గురునృప
భీష్మాదులగెలిచిన భూపతికై

గజిగా యవనాభిదు ముచుకుందుని
గనుదృష్టినిఁ జంపిన శ్రీపతికై
బలువిడి దేవకి తండ్రిని మధురకుఁ
బట్టము గట్టిన గోవిందునకై
గెలఁ దాల్చినవైఖరి గోవర్ధన
గిరిమోచిన మహాదానందునకై

## ఉత్కళిక

తొలిపుట్టువు నోము ఫలంబున వే
బలువిడినగు పేదఱికంబున వే
సరికొందలమందుచు పయనంబై
పురికింబరమానందమునంబై
కొనియుబ్బుచువచ్చి కలిమిపనికిం
గనియడుకులొసంగిన బాపనికి
గలిమిచ్చిన బాలస్నేహునకై
కలుములచే నేలిన కృష్ణునకై.

## పంచమీవిభక్తి

మ॥ పురుటింటం బసిబిడ్డ చందమున - వాపోవంగ నాఁడాత్మలో
మురువొప్పన్విష దుగ్ధయుగ్మకుచయై - ముద్దాడు రాకాసిచ
న్నిరుగేలంగొని బాలుఁడావుమిషచే - నిమ్మైన కాలంబునన్
ధరణింగూల్చిన నంద పుత్రువలనం - దార్క్యాణధర్మస్థితుల్.

## కళిక

మఱియు గీతామృత స - మగ్రసింధునివలన
వఱలు భవపటుతిమిర - వనజబంధునివలన
బొంకుటెయ్యెడలేని - భూరిసత్యునివలన
జంకుటెన్నడులేని సమరనిత్యునివలన

ఖేదముల్ బెడబాపు - కేశిమర్దనువలన
నాదికారణమూర్తి - యగు జనార్దనువలన
గానరాని పదముల గాము పానుపువలన
పూనిగొ్రడాలికిం - బుట్టుకానుపువలన

ఉత్కళిక

తనువుబిల్వమిగుర్యార
దినిపాకమింపారఁ
జేసిద్రౌపదిచేతి
నానఁదీరఁగ మేఁతి
యడిగిన మునీశులకు
నిడఁగల్గు దాసులకు
గల్పించుహరివలనఁ
గల్పస్థాయివలన

షష్ఠీవిభక్తి

శా॥ కారాగారమునందు వెల్వడి భుజం - గస్వామిసుచ్ఛత్రమై
వైరాఁ దార్తుఁడు వాకిళుల్ దెఱువ న-భ స్తోమముల్ మీఱ శ్రీ
సూరోద్భూతిపథంబొసంగఁ దనుగొం-చుం దండ్రియే తెంచి జా
ల్వారేపల్లెను నిల్పఁ బొల్చు హరికి-న్వాలార నే మొక్కెదన్.

కళిక

మఱియుఁ బెఱయనెఱను నుఱియు-మధునిఁగూల్చినట్టి హరికి
నఱిమి తఱిమి చఱిమి నుఱుము-నక్రుఁ గెల్చిన వితకరికిఁ
గఱచి చఱచి యఱచి పఱచుఁ-గపిని జంపి నచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి సొరగు-మద్దులీడ్చినయమితునకు
సరలి కెరలి వరలి మరలి-సాళ్వుఁ జంపి నతురునకు
గరిమ మెరిమెయెరిమినెరిమి-కామెపల్లిమందిరునకు
నయముఁ బ్రియము రయము జయము-నరున కిడిన కేశవునకు
వ్యయము భయము లయము క్షయము-వైరికొసఁగుమాధవునకు

ఉ త్క లి క

గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ - బెల్లు జల్లులల్లిరాళ్ల
సోనవానమానవూని - కానరాని కోనలోన
చుట్టిపట్టి గట్టిదిట్ట - రొట్టు గట్టు మట్టు గుట్టు
నూఁచి లోచినోచి మోఁచి - బ్రోచినట్టి వామనునకు

సప్తమీవిభక్తి

మ॥ పృథులావంతి వరస్వయం వరమునన్వీంచాను విందాదులన్
బ్రథనక్షోణిని గెల్చి సద్గుణ సుభద్రన్ భద్రదోశ్శాంచు వ
చ్చిధరాధీశు ననుజ్ఞచే ననలసాక్షీకంబుగ్రుహోద్యుక్తన
ద్విధిఁ బెండ్లాడిన కృష్ణునందు నిలిచెన్ ధీరప్రతాపోన్నతుల్

క లి క

మఱియు నుగ్రసేనా - మాత్యునందు
నెఱిమీఱ లయు కాల - నిత్యునందు
విదురార్చిత పదార - విందునందు
విదళిత ఘోరారి - బృందునందు
నాభీరు వస్త్రాప - హారునందు
బలిపట్టణద్వార - పాలునందు
జలగాది దశలనూ - చ్ఛాదునందు

ఉ త్క లి క

సజ్జరాగంబు
రజ్జునాగంబు
కంధిరోగంబు
మంధరాగంబు
రాపుతోనూఁచి
వీపుతో మోఁచి
వెలయుహరియందు
జలజాక్షునందు

సంబోధన

ఉ॥ ధర్మజుఁడంపినం జరిగి-దంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁ జెప్పి దుష్కృతుల-దగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తులెల్లఁగను-నేరుపునన్సభఁ దాల్చినట్టి ని
ష్కర్మవహాకృతిం దలఁతు-నాదు మనంబున నందనందనా!

కళిక

మఱియు జగన్మోహన - మాయఁదాల్చిన జాల
జిఱుము తఱిద్రౌపదికిఁ - జీరలిచ్చిన శాల!
సఖులతో నదిలోనఁ - జల్లిగుడిచిన బాల!
విఖనసుండెదలోన - వేఁదలిర్చినలోల!
నరు తేరినొగలపై - నాట్యమాడినవీర!
నరకుఁగొని భీష్మపై - చక్రమెత్తినశూర!
తరిని సద్గురు సుతుల - దాపరించిన సదయ!
పెరిమ నాగపురంబు - పెక్కలించిన విజయ!

ఉత్కళిక

గురుభీష్మరాధేయు
లరుజన్యమున నేయు
శరవహ్ని బయలెల్కి
యరద మెల్లను నెక్కి
తరిగొల్పునెడ పాండు
వరులనేగురి మెండు
బ్రతుకఁ జేసిన పుణ్య!
వితత దీనశరణ్య!

సార్వవిభక్తికము

శా॥ నీ వొక్కండవు, నిన్నునమ్మి కొలుతు - న్నీచే సుఖంబబ్బె నీ
కై వేసండ మొనర్తు నీ వలన నిష్టావాప్తి చేకూరె నీ
కే విశ్వాసముఁ జేర్చితింక మదిలో హెచ్చయ్యె నీయందు నా
కై వారంబులు శౌరసేనతనయా - కామేపలీ వల్లభా!

కవినామము - అంకితము

ఉ॥ నామనవిచ్ఛగింపు మిట - నన్నయభట్ట కృతాంధ్రశబ్ద చిం
తామణి కల్పనోక్త కల - నాచతురోపమ ఉల్లసిల్ల ని
చ్ఛామతి నర్పణంబుగ నో - సంగితిఁ గామెపలీశ! నీకునై
రామయమై తగన్ భవ దుదాహరణంబు జగత్ప్రసిద్ధిఁగన్

---

## గణపవరపు - వేంకటకవి - ఉదాహరణము

ప్రబంధరాజవిజయ వేంకటేశ్వరవిలాసము, సర్వలక్షణ శిరోమణి మున్నగు బహుమహాగ్రంథములు రచియించి ప్రఖ్యాతిగన్న వేంకటకవి తానొక యుదాహరణమును రచియించినట్లు, తన ప్రబంధరాజమున నిట్లు చెప్పికొనియున్నాఁడు:—

సీ॥ శ్రీకరంబుగఁ బదిరెండవయేట తా
రావళుల్ రచియించి ప్రౌఢిఁ గన్న
ముని ముని మీసంబు మొనయునేటనె యమ
శతక మొనర్చి కౌశలము గన్న
ఇరువది యేటను శృంగారమంజరి యు
నుదాహరణఁ జేసి ఘనతఁ గన్న
ఇరువదేనవ యేట కృష్ణమల్ల కథ
చతుర్భద్రఁ జెప్పి సంతుష్టి గన్న
మఱియు బాలరామాయణ ద్విపద
ప్రసంగించి బహువిధ చాటుకవితఁ
గీ॥ అతిశయముగన్న నాదు జిహ్వాంచలంబు
తనివినొందదు కులదేవతావతంస
వేంకటేశ్వర చరణారవిందమహిమ
నవనవోన్మేష పేశవర్ణ నలఁగాక.

(పుట 5. 26. ప్రబంధరాజము - అముద్రితగ్రంథచింతామణి ప్రకటితము-నెల్లూరు.) 1892

ఈ యుదాహరణము లభింపలేదు. ఈతని కాలనిర్ణయమును గుఱించి యొక్కొక్కరొక్కొక విధముగ వ్రాసియున్నారు. * కాని యీతని కాలనిర్ణయము సులభముగాఁ జేయువిషయము నాతఁడే తాను రచించిన విద్యావతీదండకములో నిట్లు చెప్పియున్నాఁడు —

"దండకము"—శ్రీ విశ్వనాథాన్వయాంబోధిచంద్రుండు ... సత్కాశ్యపాభిఖ్య గోత్రుండు, భాస్వచ్చరిత్రుండు, శ్రీతిర్నెల్వేలితలాధీశ పౌత్రుండు వీరావనీపాలపుత్రుండు, వీరాధివీర స్తుతోదారవచ్చొక్కనాథక్షితీశాగ్రణీసోదరుం డాశ్రిత త్రాణబద్ధాదరుం డద్రికన్యాసమానోల్లసల్లింగమాంబావధూగర్భ శుక్తిస్ఫురన్ మౌక్తికాకారుఁడై యొప్పు ముద్దళ్ఘురి క్షోణిపాలుండు ... .. చొక్కాటంబుగా రాజసం బెచ్చ నిండువేరోలగంబుండి .. ... విద్యావతీ కన్యకారత్న మాత్మీయమౌ నాట్యశాలాస్థలీపాత్రలందెల్ల సన్మానపాత్రంబుగా శ్రీమించి వర్ధిల్లు ... ...గుణామేయ లక్ష్మీనివాసస్ఫురత్ పాండ్యసింహాసనాధ్యక్షు పేరన్ జయోదాత్తముద్దళ్గిరి క్ష్మాతలాధీశు పేరన్, వృషాద్రీశ సంకాశు పేరన్, మహాలక్షణ గ్రంథభాషాభిదాన ప్రథామాధురీ సాధురీత్యర్థవచ్ఛబ్ద బంధానుబంధ ప్రబంధాది నాథాప్పయామాత్య రాడ్వేంకటార్య ప్రణీతంబుగాఁ బొల్చు నాపుష్ప కోదండకంబైన విద్యావతీదండకంబుర్వినా చంద్రతారార్కమై యొప్పు నెల్లప్పుడున్."

(A Descriptive Catalogue of Telugu Manuscripts vol viii Yakshaganas and Dandakas (No. 1834-2040) No 2014. Page 2262&2263.)

మధురను పరిపాలించిన సుప్రసిద్ధాంధ్రనాయక రాజవంశము నకుఁ జెందినవాఁడీ ముద్దళగిరి. ఈతఁడు ముద్దువీరప్ప నాయకుని కొమా

---

*

1. ప్రబంధరాజము పీఠిక - పూండ్ల రామకృష్ణయ్యగారు. 1892
2. వీరేశలింగము పంతులుగారు - ఆంధ్రకవులచరిత్ర తృతీయభాగము 163-168 పుటలు
3. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక-3 సం
4. శతకవులచరిత్ర. 2 వ భాగము-195-196 పుటలు.
5. ఆంధ్రకౌముది పీఠిక - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికటితము,

రుఁడు. చొక్కనాథనాయునికిఁ దమ్ముఁడు. చొక్కనాథనాయకుఁడు, రాజ్యభారమువహింపలేని వయసున్న రాజ్యమునకువచ్చుటచే, ముద్దళగిరియే రాజ్యభారము వహించెను. ఈతఁడే తంజావూరిపై దండెత్తి, విజయరాఘవనాయకుని నోడించి దానిని వశపఱచుకొనెను. ఈవృత్తాంతము క్రీ. శ. 1679 లో జరిగినది. కావున నీతనికిఁ గృతి నిచ్చిన వేంకటకవియు నాకాలమువాఁడనుట నిర్వివాదాంశము. ఈతఁడు వీరేశలింగము పంతులుగారు చెప్పినట్లు, కూచిమంచి తిమ్మకవి తరువాతి వాఁడు గాఁడు. పరిషత్పత్రికాసంపాదకులు చెప్పినట్లు, విజయరంగచొక్కనాథుని కాలములో వాఁడు గాఁడు. ఈతఁ డప్పకవి సమకాలికుఁడు. విద్యావతీదండకము * ముద్రితము. ఈతని ప్రబంధరాజమువునర్ముద్రణము చేయవలసిన యుద్గ్రంథములలో నొకటి. ఈతనిఁ 'యాంధ్రకౌముది' వేయి చరణములు గలవ్యాకరణము పరిషత్ప్రకటితము. ఈతని నిఘంటువు వేంకటేశాంధ్రము 1898 లో కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలలో ముద్రితము. ఈతని కృతులలో ద్విరూపకోశమును, ఆంధ్రప్రయోగరత్నాకరమును ముద్రింపఁదగిన శాస్త్రీయగ్రంథములు. ఈరెండుగ్రంథములప్రతులును తంజావూరిలో సరస్వతీభాండారముననున్నవి.

---

* విద్యావతీదండకము. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలవారిచే, నాచే సంస్కరింపబడి ముద్రితము. (1947 సం॥)

# ఉదాహరణ సూచనము

పోచనకవి 'చంద్రాభ్యుదయము' అను ప్రబంధములో

"గీ॥ రసికసభయెల్ల బళిబళిరవముతోడ
వేడుకలు దేరఁగా దదుర్వీసు పర్వ
శంబరారి యుదాహరణంబు చదివి చదివి
వీణగైకొని గీత ప్రవీణమతిని." అని పేర్కొన్నాఁడు

చంద్రాభ్యుదయము 2. వ ఆశ్వాసము.

ముద్రితము కాలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందలి D. 505, R 125 అను ప్రతులననుసరించి వ్రాయఁబడినది.

---

# విశ్వేశ్వరోదాహరణము.

ఏనుఁగు లక్ష్మణకవి.

భర్తృహరి త్రిశతిని ప్రసన్నమనోహరముగ తెలుఁగుచేసిన ప్రసిద్ధకవియగు నేనుఁగులక్ష్మణకవి తాను విశ్వేశ్వరోదాహరణమును వ్రాసినట్లు, రామవిలాసమను తనకృతిలో. కృతిపతియగు శ్రీవత్సవాయి గోపరాజుచేత నిట్లు చెప్పించినాఁడు-

సీ॥ సృజియించినాఁడవు సేతురామేశ్వర
మహిమంబు పాండిత్యమహిమ మెఱయ
కల్పించినాఁడవు ఘను లెన్న జాహ్నవీ
మాహాత్మ్యకృతి సుధామధురభణితి
నిర్మించినాఁడవు నిర్జరభాషచే
శతకంబు భాస్కరస్వామి కెలమి
రచియించినాఁడవు రుచిరంబుగా సుభా
షితరత్నమాలిక శివుని పేర

తే. గీ॥ రమ్యవిశ్వేశ్వరోదాహరణ నృసింహ
దండకాది స్తుతి ప్రబంధములుగూర్చి
సములలోను త్తమఖ్యాతినమరినావు,
లతిగుణధుర్య ! యేనుఁగులక్ష్మణార్య !

లక్ష్మణకవి, విశ్వేశ్వరోదాహరణము నేఁడు లభ్యమగుట లేదు. లక్ష్మణకవి యధునాతన ప్రసిద్ధ కవులలో నొకఁడు. ఈతఁడు క్రీ. శ. 1700 - 1790 ప్రాంతముల జీవించియుండెను. ఈతని తల్లి దండ్రుల వంశము వారందఱును ప్రసిద్ధకవులు. లక్ష్మణకవి యింటిపేరు తొలుత పైడిపాటి వారైనను నీవంశములో జలపాలామాత్యుఁడను నాతఁడు గజపతిని మెప్పించి గజమును (ఏనుఁగును) బహుమానము పొందుటచే, నాఁటినుండియు వీరింటిపేరు ఏనుఁగువారైరి. వీరికుటుంబము నేఁటివఱకు నవిచ్ఛిన్నముగనున్నది. ఈతని నివాసస్థానము తూర్పు గోదావరీమండలమున రామచంద్రపురము తాలూకాలోని పెద్దాడ. ఈతనిపూర్వులందఱును పెద్దాపురసంస్థానము నాశ్రయించిన ప్రసిద్ధ కవులు. ఏనుఁగు లక్ష్మణకవి తాత యేనుఁగు పెదలక్ష్మణకవి. ఈతఁడు 1. రాజశేఖరచరిత్ర 2. భీమసేనవిజయము 3. భల్లాణరాయచరిత్రము 4. ద్రౌపదీపరిణయము 5. ధ్రువచరిత్రము 6. తుల్యామహాత్మ్యము మొదలగు గ్రంథములువ్రాసి, సంగీత సాహిత్యముల యందసమాన ప్రజ్ఞగడించి పెద్దాపురమును క్రీ.శ. 1649 - 1688 వఱకుఁ బరిపాలించిన సార్వభౌమతిమ్మజగపతి మహారాజు కాలముననున్నవాఁడు. లక్ష్మణకవి తండ్రికూడ కవియేగాని యాతని గ్రంథములు కానరాలేదు. లక్ష్మణకవి కృతము లీక్రింది గ్రంథములు లభ్యములగు చున్నవి.

1. విశ్వేశ్వరోదాహరణము. ఉదాహరణగ్రంథము లభ్యము కాలేదు. 2. నృసింహదండకము. లభ్యము కాలేదు. 3. సూర్యశతకము (ఇదిసంస్కృతము)'నిర్మించినాడవు నిర్జరభాషచే' అనువాక్యమిందులకుఁ బ్రమాణము. 4. విశ్వామిత్ర చరిత్ర. ఈ తెలుఁగు ప్రబంధము లభ్యము కాలేదు. 'రామేశ్వర మహిమము విశ్వామిత్రచరిత్ర, అనువాక్యమిందులకుఁ బ్రమాణము.

5. భర్తృహరి త్రిశతి - లక్ష్మణకవి కృతులలో సర్వాంధ్రదేశవ్యాప్తిగన్నది. ఈసుభాషితము నీతఁడు తనయిష్టదైవమగు పెద్దాడసోమశంకరునికిఁ గృతినిచ్చినాఁడు. ఈతని గ్రంథమునకు ముందు దీనిని [1] యెలకూచిబాలసర్వతి క్రీ.శ. 1640 ప్రాంతములఁ దెలిగించి నాఁడు. లక్ష్మణకవి సమకాలికుఁడగు పుష్పగిరి తిమ్మనయు, [2] నాతని వెనుక [3] పోచిరాజువీరన [4] గురురాజకవి, కంపపద్యములలో వెల్లాల నరసింగయ్య [5] దీనిని భాషాంతరీకరించినారు. దీనిలో నీతి శతకమునకు క్రీ. శ. 1878 లో మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు ప్రశస్తమైన టీకాతాత్పర్యవివేచనమును రచియించి యిందులోఁ గొన్ని పద్యములఁ దెలిగించిరి. ఇటీవల న్యాయవాదులును, నెల్లూరి వాస్తవ్యులునగు శ్రీ గుత్తిం వెంకటసుబ్రహ్మణ్యాం యం. యె. బి. యల్. గారు దీనిని పూర్తిగ తెనిఁగించిరి.

6. జాహ్నవీమహాత్మ్యము - ఇదిపద్యకావ్యము. క్రీ. శ. 1927 లో చిత్రాడ రామవిలాసగ్రంథమాలికలో ముద్రితము.

7. రామేశ్వరమహాత్మ్యము - ఇదియుఁబద్యకావ్యమే. దీనికి నండూరి రామ మంత్రి ప్రేరేపకుఁడు. ఇందు కాకినాడ శలపాక మహానాఁటికి ప్రధానులగు నండూరివారివృత్తాంతముగలదు. వెంటూరిసోమనాథునికిఁ గృతి. ఇది క్రీ. శ. 1904 లో మంజువాణిపత్రికలోఁ బ్రకటితము.

8. రామవిలాసము - శ్రీవత్సవాయిగోపరాజునకుఁ గృతి. ఇది లక్ష్మణకవికృతులలోఁ గడపటిది. క్రీ. శ. 1904 లో ముద్రితము.

---

1. ఎలకూచి బాలసరస్వతి. కావ్యము. జటప్రోలు సంస్థానాధీశుఁడగు సురభి మల్లభూపాలుని కంకితము. క్రీ.శ. 1904 లో శ్రీవీరేశలింగము పంతులవారిచేఁ బ్రకటితము.

2. పుష్పగిరి తిమ్మన నీతిశతకము. క్రీ.శ. 1900 లో అముద్రితగ్రంథ చింతామణి నెల్లూరులోఁ బ్రకటితము.

3-4. లభ్యముకాలేదు.

5. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటితము.

గ్రంథసూచిక :—

1. ఏనుఁగు లక్ష్మణకవి-కవిజీవితములు-గురుజాడ శ్రీరామమూర్తిగారు. 1893
2. ,, కందుకూరి వీరేశలింగముగారు (కవులచరిత్ర-3 వ భాగము. 44-52 పుటలు. 1900)
3. శతకకవుల చరిత్ర - వంగూరి సుబ్బారావు. 1924 శతకకవులచరిత్ర - పుటలు - 238-245 మూఁడవ భాగము.

---

# శేషార్యోదాహరణము

బాలకవి :- అనంతయ

[ఈ శేషార్యోదాహరణమునఁ బ్రశంసితుఁడైన శేషార్యుఁడు నల్లందిగళ్ వంశమునకుఁ జెందినవాఁడు. ఈ నల్లందిగళ్ వారి వంశావళిని 'సీసమాలికగా' పై యనంతకవియేఁ గూర్చినాఁడు - దానినుండి మనకు ప్రస్తుతమగు భాగమును నుద్ధరించుచున్నాఁడను-

సీ॥ "శ్రీ......మన్మథ మన్మ
ధాకృతివైన నిన్నందు వెనుక
శ్రితజన సంస్తుత్య శేషయామాత్య ప
ర్వతధైర్య వేంకట రాఘవార్య
ఘనకీర్తి నిస్తంద్రు కస్తూరిమండ
......తేజోరూప వైభవముల
తొలుతన సకలవిద్యలు నేర్చి నానాఁట
నభివృద్ధిఁ బొందుచు నహరహంబు
నీమాట జవదాట కామోదమును గూర్చ
చలరామచంద్రున కనుజులైన
శత్రుఘ్న భరతలక్ష్మణుల చందమునను
తమ్ములై నీకు చిత్తమ్ములలర
సేవ సేయుచు పాండ్యసింహాసనస్థుఁడై
దక్షిణరాయలై తనరు విజయ
రంగ చొక్కనృపాలు రత్నసమ్ముఖమున
ఆప్తులై మిత్రులై యాధికులగుచు

కొలువఁగా వారిలో గుణ ఖనిరైన వేం
కటరాఘవాచార్యు కదన శౌర్యు
మెల్లనె పాండ్యభూమిపతి చేపట్టె...
........నతఁడు విలసిల్లు
అతని కూరిమి తమ్ముఁడైన కస్తూరయ్య
పరిఢవిల్లె ... కడు కీర్తి
గాంచెనా ఘనుని కగ్రజుఁడైన
శేషార్యుఁ డంచిత శ్రీ వహించి
బాంధవతతికి కల్పక భూరుహంబయి
కవులకు నిక్షేపకలనఁదనరి
ఆశ్రిత తతులకు నమరనగంబయి
యంగనలకుఁ గుసుమాయుధుఁడయి
తన చెలి కాంతకుఁ దంగేటి జున్నయి
తమ్ములకెల్ల మోదప్రదుఁడయి
పేదయౌ జనముల పెన్నిధానంబయి
యకలంక కీర్తిచే నతిశయిల్లె-

(నల్లందిగళ్ వారి వంశావళి - అముద్రితము - Government Oriental Manuscripts Library, Madras. R. No. 759 Pages 7 & 8.)

పై యుద్ధృతాంశమును బట్టి, శేషార్యుఁడు క్రీ. శ. 1704 - 1732 వఱకును మధురను పరిపాలించిన సుప్రసిద్ధాంధ్రనాయకుఁడు విజయరంగ చొక్కనాథుని కాలములో నున్నవాఁడని స్పష్టమగుచున్నది. కృతికర్తయగు అనంతయ, బాలకవి బిరుదాంకితుఁడు - ఈతఁడు తన గాథేయోపాఖ్యానమును బదిరకృష్ణ భూపాలున కంకితమిచ్చెను, నందులో తన వంశ వృక్షము నిట్లిచ్చియున్నాఁడు-



సీ॥ ఘనమౌని కులమాన్యకౌండిన్య గోత్ర ప
విత్రుఁ డాపస్తంబసూత్రమహిత
గతి వారి రేవూరి కాళహస్తి కవీంద్ర
పౌత్రు లింగకవీంద్రపుత్రుఁ గాళ
హస్తి మహాకవి యగ్రజన్ము నేకామ్ర
కవిశాఖామణి గుర్వ కవితిలకు
వానందసుకవుల యగ్రజన్ముని ఘటి
కాశత గ్రంథ సంఘటకు లేఖి
నీశతవరేణ్య కవితా ప్రకాశకుని ది
వ్యప్రబంధ నిబంధను నను ననంతు
తన రుచిరబోధయుత మనోవనరుహమున
తనరు నెనరునగనుఁగొని యనియె నిట్లు.

ఈతఁడు వృద్ధాచలమహాత్మ్యమును రచించి పంట లింగారెడ్డి కంకితముగావించెను- ఈతని పౌత్రుఁడు 'అనంతకవి' తన శ్రీముష్ణమహాత్మ్యమను గ్రంథములో నీ యనంతుని నిట్లు ప్రశంసించియున్నాఁడు—

సీ॥ ఐదేండ్లనాఁడె వేదాది విద్యలు నేర్చి
విభులమెప్పించె గర్వితుల నణఁచి
అట్టి ప్రాయమునాఁడె యష్ట భాషల జతు
ర్విధకృతుల్ ధరవి. నిర్మించి నిలిపె
ఘటికాశతది నైకప్రబంధముల మై
సూరి చెంజిండ్ల మెచ్చులుఘటించె
నూఱుఘంటములకై నోరూరఁగ ఘనాఘ
నంబున కవిత మిన్నంగి పలికె
నేక సంధావధృతధృతా నేకవిబుధ
దుర్గ్రహగ్రంథసాహస్ర తూర్ణ తుష్ట
మండలాధీశదత్త సమ్మానబాల
కవియనంతేంద్రు నెన త్రిలోకములఁగలరె?

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక - 3 సం. పరిషత్పుస్తక భాండాగారము.]

ప్రథమావిభక్తి

శా॥ శ్రీనల్లందిగళన్వవాయమువనిన్ - జెన్నొందు నేవంశమం
దానారాయణ జియ్యరంచనఁగఁ దా - నారాయణుం డుద్భవం
బై నాఁడందు జెలంగు తిర్మలసుధీ - యాదోధి చంద్రుండు దా
నానూనస్థిరకీర్తి శేషఘనుఁ డు - ద్యద్ధర్మశర్మాఢ్యుఁడై.

